# ఈశ్వరాస్తిత్వ ప్రమాణములు

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications



Like us to follow
@mohanpublications

mohan PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ఆంధ్రబ్రాహ్మమండలీ గ్రంథమాల.

# ఈశ్వరాస్తిత్వప్రమాణములు

# బ్రాహ్మధర్మసిద్ధాంతములు.

పండిత సీతానాథ తత్త్వభూషణ

విరచితము.

అనువాదకుడు

పాలానఝ్ఝల లక్ష్మీనారాయణ.

స్కేప్ అండు కో., ముద్రాక్షరశాల,

కాకినాడ.

1920

[illegible]—1—1920 ]

వెల 3 అణాలు.





ఓం

# ఈశ్వరాస్తిత్వ ప్రమాణములు.



"ప్రమాణము" అను పదమునకు వాడుకలోనున్న అర్థమునుబట్టి ప్రమాణములిచ్చి ఈశ్వరుడు కలడని బుజువుపరచుటకు వీలులేదు. ప్రమాణమనగా తెలిసిన యొక వస్తువులనుండి తెలియని యొక వస్తువును గురించిన జ్ఞానమును పొందగల సాధనము. ఎట్లనగా, మన మొక కాలువలో పడమరనుండి తూర్పునకు పడవలో ప్రయాణము చేయు చున్నప్పుడు, గట్టుమీదనుండు చెట్లు తూర్పునుండి పడమరకు ప్రయాణము చేయుచున్నట్లుకనపడును. కాని, చెట్లు కదలక స్థిరముగానున్నవనియే మన మెరుగుదుము. నిజముగా ప్రయాణముచేయుచున్నది మనముండు పడవయేగాని, చెట్లుకాదు. ఈయనుభవసిద్ధమయినజ్ఞానమునుండి మనకు తెలియని మరియొక నూతనాంశమును తెలిసికొనుచున్నాము. సూర్యుడు తూర్పునుండి పడమరకు ప్రయాణము చేయుచున్నట్లు కనబడుచున్నాడు గాని నిజముగా ప్రయాణముచేయునది మనము నివసించుభూమియే యనియు, అది పడమరనుండి తూర్పుగా ప్రయాణము చేయు

ఏలు

లూడవు.

నడి బట్టియే సూర్యుడు తూర్పునుండి పడమరకు ప్రయాణము చేయుచున్నట్లు కనబడుచున్నాడనియు తెలిసికొనుచున్నాము. పులి ఎట్లుండునని పిల్లవాడడిగినప్పుడు పెద్ద పిల్లివలెనుండునని చెప్పి, పులియొక్క స్వరూపమును తెలియజెప్పుచున్నాము. ఈప్రకారముగా ప్రమాణముల వలన ఒక సత్యమును ఋజువుపరచవలసి వచ్చినప్పుడు గాని, ఒక వస్తువును గురించి తెలుపవలసి వచ్చినప్పుడుగాని, రెండు వేరువేరు వస్తువులుండవలెను. మనకు తెలిసినదొకటి తెలియనిదొకటి. ప్రస్తుతవిషయమున రెండువస్తువులు లేవు. ఈశ్వరుడు తెలియని వస్తువుకాదు. అంతేకాదు, మనకు తెలిసినవస్తువు అతడొక్కడే. మనమెరిగినదంతయు, మనకు తెలిసినదంతయు, ఈశ్వరునిలోనిదే. ఈశ్వరునియందు అంతర్గతమయినదే. ఈశ్వరునికంటె వేరయిన వస్తువు మరియొకటి లేనేలేదు. నిజము విచారించిన యెడల సమస్తమును బ్రహ్మమే. "సర్వంఖల్విదం బ్రహ్మ" (ఛాందోగ్య 3-14) అను ఉపనిషద్వాక్యము పరమసత్యము. ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణములయొక్క ఏకమాత్ర ప్రమేయము బ్రహ్మమే. అనగా, ఈమూడు ప్రమాణములవలనను తెలియబడునది, ఋజువుపఱుపబడునది బ్రహ్మమేకాని అన్యముకాదు. కావుననే, 'ప్రమాణ' పదమునకు వాడుకలోనున్న అర్థమునందు ఈశ్వరుడు కలడని ప్రమాణములిచ్చి ఋజువుపరుచుట సాధ్యముకాదని చెప్పియున్నాము. మరియు,

మనము తెలిసికొను సమస్తవస్తువులు, నిజముగా ఈశ్వరుడని భావింపక, ఈశ్వరునికంటె భిన్నములని యెంచి, ఆసమస్తవస్తువులయొక్క అస్తిత్వమువలన, అనగా ఉనికివలన, వేరొక తెలియనివస్తువును, తెలియని కారణమును ఊహించినయెడల, ఆ యజ్ఞానకారణము,ఆ యనుమానింపబడిన వస్తువు ఎన్నడును ఈశ్వరుడు కాజాలదు. ఎందుచేతననగా అది తప్పక ఆద్యంతములు గల పరిమితవస్తువగును. ఎట్లనగా, మనము,మనకు తెలిసిన యొక వస్తువునుండి, వేరొక తెలియని వస్తువును అనుమానించినయెడల, ఆ తెలియని వస్తువు, ఆయనుమానింపబడిన వస్తువు, తెలిసిన వస్తువుకంటె భిన్నమైనదగును. ఉదా: మనకు తెలిసిన విశ్వమునుండి, తెలియని బ్రహ్మమును అనుమానించిన యెడల, తెలియని బ్రహ్మము, తెలిసిన విశ్వముకంటె భిన్నవస్తువగును. బ్రహ్మము విశ్వముకంటె భిన్నమైనప్పుడు, విశ్వముకూడ బ్రహ్మముకంటె భిన్నమగును. ఇట్లు బ్రహ్మము, విశ్వము అను పరస్పర భిన్నములగు రెండు పరిమితపదార్థములేర్పడినవి. కావున, బ్రహ్మముగా అనుమానింపబడిన వస్తువు బృహద్వస్తువులలో కెల్ల బృహత్తమమైనదయినను పరిమితమయిన దగుటచే ఈశ్వరనామమునకు అర్హముకాదు. కావున ఈశ్వరునికంటె భిన్నమైనవస్తువుమరియొకటి కలదనుటకు వీలులేదు. రెండువస్తువులు లేనప్పుడు ప్రమాణ ప్రమేయములుండవు. ఈప్రకారముగా ఈశ్వరుడు కలడనుటకు ప్రమా

ణములు అసంభవమయినను, ఈశ్వరాస్తిత్వము ప్రమాణము లకు అతీతమయియున్నది కాని, ప్రమాణరహితముకాదని తెలుపబోవుచున్నాము. భ్రాంతిజనకములయిన యక్షులు, రాక్షసులు, దేవదూతలు, మొదలయినవి ప్రమాణరహితములు. అవికలవనుటకు నిజమైన ప్రమాణములు లేవు. అవి కల్పితములు, కేవలము విశ్వాసము మీాద ఆధారపడియున్నవి. ఈశ్వరాస్తిత్వము వానివంటిది కాదు. సర్వమయుడును, సర్వవ్యాపియు, అనాదియు, అనంతుడును అగు వస్తువు, జ్ఞానమునకు విషయరూపమునను అనగా తెలియబడువస్తు రూపమునను, జ్ఞానమునకువిషయీరూపమునను అనగా తెలిసికొను వస్తురూపమునను, ప్రతిముహూర్తమునందునుప్రకాశించు చున్నాడు. తెలిసికొనునదియు ఆయనే, తెలియబడునదియు ఆయనే, గనుక, ఆయన కలడనుటకు ప్రమాణములియ్యవలసిన అవసరమేమియును లేదు. ఆయనను బుజువుపఱుపగలిగినట్టియు ఆయనకు భిన్నమయినట్టియు మఱియొక్క వస్తువులేనేలేదు. ఆయన అద్వితీయుడు, స్వయంప్రకాశుడు, స్వతస్సిద్ధుడు, ప్రమాణాతీతుడు. ఈ అర్థమునందే ఆయనకలడనుటకు ప్రమాణములిచ్చుట సాధ్యముకాదని చెప్పి యుంటిమి.

కాని, ఈశ్వరుడు జ్ఞానమునకుఏకమాత్ర విషయమయినను, అనగా తెలియబడువస్తువు ఈశ్వరుడొక్కడేయయినను, అజ్ఞానావస్థలో, మనమాయనను గుర్తుపట్టజాలము. ఎట్లనగా,

ఒకశిశువుతండ్రి శిశువుయొక్క శైశవదశయందే విదేశము
నకు వెళ్ళిపోయెను. శిశువుపెద్దవాడైనతరువాతతండ్రిస్వదేశ
మునకు మరలివచ్చి కుమారుని యెదుట నిలువబడెను. పుత్రు
డు తండ్రినిచూచెను, కాని, అతడు తండ్రియనిగుర్తింపలేక
పోయెను. ఆధ్యాత్మికచక్షువు, జ్ఞాననేత్రము, తెరవకమునుపు
జగత్పితృవిషయమై కూడ, మనదశ యిట్టిదే. మనమాయ
నను సర్వదా బాహ్యాంతరముల యందు చూచుచున్నాము.
కాని, గుర్తుపట్టజాలకున్నాము. మనమాయనను బాహ్యమున
చూచినప్పుడు,ఆయనను గుర్తింపజాలక "ఇది జడజగత్తు"
అనుచున్నాము. మనమాయనను మనమనస్సునందు చూచి
నప్పుడు ఆయనను ఆనవాలుపట్టజాలక, 'ఇది నేను', "ఇది కేవల
పరిమితమగు చైతన్యము" అనుచున్నాము. బాగుగా పరి
శీలించిన యెడల మనము నిజముగా పరిమితములో అపరిమి
తుని చూచుచున్నాము, కాని, అపరిమితుని గుర్తించుటలేదు.
అపరిమితుని గుర్తించుటకు ఏదైన సాధన మున్నదా ?
ఆహా, కలదు. ఆసాధనమునకే 'ఈశ్వరాస్తిత్వ ప్రమాణము'
అని పేరు. మేమీయుపన్యాసమున ఆసాధనమును గురించి
సంగ్రహముగా తెలుపుచున్నాము.

పాశ్చాత్య బ్రహ్మవిద్యయందు ఈశ్వరుడు కలడనుటకు
నాలుగుప్రమాణములు కలవని ప్రసిద్ధము. స్థూలదృష్టులగు బ్ర
హ్మవాదులు ఈ ప్రమాణముల నన్నిటిని, పరస్పరభిన్నములగు

స్వతంత్రప్రమాణములని వ్యాఖ్యానము చేయుచున్నారు. మరియు, వారివారి జ్ఞానమును, అభిరుచిని అనుసరించి కొందరొకరు దానిని, మరికొందరింకొకదానిని ప్రబలతరములని వాదించుచున్నారు. నిజము విచారించిన యెడల ఈవివిధ ప్రమాణములు ఒకటే ప్రమాణము యొక్క వేరువేరు సోపానములు మాత్రమే గాని, స్వతంత్ర ప్రమాణములు కావు. ఏప్రమాణమునయినను మిగిలినవాని నుండి విడదీసి ప్రత్యేకముగా గ్రహించనియెడల, దేనివలనను ఈశ్వరుడు కలడని ఋజువుపడ నేరదు. వివిధప్రమాణములు ఒక సత్యమునే ఋజువుపరుచు సోపానములని గ్రహించినయెడల, ప్రతిప్రమాణమునందును, బ్రహ్మముయొక్క కొన్నికొన్ని లక్షణములు తెలియవచ్చును. నాలుగు ప్రమాణములవలనను తెలియవచ్చు లక్షణములను ఒకటిగా చేర్చిన యెడల, ఒక సర్వాంగసుందరమగు బ్రహ్మవిజ్ఞానము కలుగును. ఈసంగతిని సంక్షేపముగా తెలుప ప్రయత్నించు చున్నాము.

ఈశ్వరాస్తిత్వమును ఋజువుపఱచుటకు నాలుగుప్రమాణములుకలవు. (1) కారణవాద ప్రమాణము (2) సృష్టి కౌశలప్రమాణము (3) అస్తిత్వవాద ప్రమాణము లేక జ్ఞానవాద ప్రమాణము (4) నైతికప్రమాణము. ఈనాలుగుప్రమాణములును మానవబుద్ధికిగల ఆలోచన శక్తియొక్క నాలుగు అంతరువులను తెలియజేయును.

ఆలోచనశక్తి అంతగాలేని మొదటి యవస్థయందు, మనుష్యునిబుద్ధి జడవస్తువుల స్వభావము, అవిపొందురూపభేదములు మొదలయిన వానిని మాత్రమేగ్రహింపగలదిగా నుండును. కారణములేనికార్యముండజాలదు, ప్రతికార్యమునకును కారణముండి తీరవలయును' అను కారణవాద ప్రమాణమే జడములను గురించిన పరిజ్ఞానమును గ్రహింపగలుగుటకు చాలియుండును. ఇట్టిస్థితి యందుండుమానవుడు ఈశ్వరుడు కలడనుటకు గూడ జడ విజ్ఞాన శాస్త్రమునందు ఉపపాదింపబడు కారణవాద ప్రమాణము చెప్పి యుక్తులతోనే తృప్తినొందును. అప్పుడు ఇతర ప్రమాణములను కోరడు. వాని విలువను గ్రహింపజాలడు. పరిశీలన శక్తికొంచెము అధికము కాగానే, కేవలము కారణవాద ప్రమాణము చెప్పుయుక్తులు చాలవు. ఈరెండవ అవస్థయందు అతడు చెట్లయాకులు, శాఖలు, పుష్పములు, పండ్లు మొదలయిన వాని కూర్పునందు కానవచ్చు నేర్పరితనమును, జీవజంతువులకరచరణాద్యవయవములనిర్మాణమునందు కానవచ్చు కౌశలమునుచూచి విస్మయమొందును. అప్పుడు ప్రాణివిజ్ఞానశాస్త్రమును గ్రహింపగలిగి దానియందు ఉపపాదింపబడు సృష్టికౌశల ప్రమాణమునందు చెప్పబడు యుక్తులతో తృప్తినొందును. ఆలోచనశక్తి ఇంకను కొంచెము అధికముకాగానే, సృష్టికౌశల ప్రమాణము చూపుయుక్తులతో తృప్తినొందడు. ఈమూడవ

అవస్థలో మనస్సుయొక్క ఆలోచన, జ్ఞాపకము, మననము, ధ్యానము, నిదిధ్యాస మొదలయిన అంతశ్శక్తులను తెలిసికొని ఆశ్చర్యము నొందును. అప్పుడు మనోవిజ్ఞానశాస్త్రమును గ్రహింపగలిగి దానియందుపపాదింపబడెడు జ్ఞానవాదప్రమాణము నందు చెప్పబడు యుక్తులతో తృప్తినొందును. అప్పుడతడు ఆత్మతత్వమును, దానిసాహాయ్యమున పరమాత్మతత్వమును గ్రహింపగలుగును. ఆత్మను గురించిన సత్యములు రెండు విధములు. ఒకటి జ్ఞానతత్వము, రెండవది నీతితత్వము. జ్ఞానతత్వమును మాత్రమే గ్రహింపగలిగినప్పుడు ఈశ్వరుడు సత్యస్వరూపుడనియు, జ్ఞానస్వరూపుడనియు, అనంతుడనియు గ్రహింపగలుగును. ఈతత్వజ్ఞానమును ఇంకను బాగుగ తెలిసికొని నిశ్చలధ్యాననిమగ్నుడు కాగలిగినప్పుడు, సమాధియోగము నందు, ఆయన ఆనందస్వరూపుడనియు, అమృతస్వరూపుడనియు, గ్రహింపగలుగును. వివేచనశక్తి ఇంకను అధికమయి జ్ఞానతత్వమును మాత్రమే గాక నీతితత్వమును కూడగ్రహింపగలిగినప్పుడునీతి విజ్ఞానశాస్త్రమును దానియందుపపాదింపబడెడు నీతి ప్రమాణమును గ్రహింపగలుగును. ఈనాలవఅవస్థయందు అతడు నీతితత్వములో తెలిసిన సత్యములవలన ఈశ్వరుడు పరిశుద్ధుడనియు, ఎట్టిపాపము చేతను అంటబడని వాడనియు, సత్యస్వరూపుడనియు, శివస్వరూపుడనియు, సుందరస్వరూపుడనియు తెలిసికొనగలుగును. ఈప్ర

కారముగా మానవుడు బుద్ధియందు క్రమవికాసమునొంది, పై నాలుగుప్రమాణముల సాహాయ్యము వలనను. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ, ఆనన్దరూపమమృతం యద్విభాతి, శాన్తం శివమద్వైతం, శుద్ధమపాపవిద్ధం' అను సర్వాంగసుందరమయి న బ్రహ్మవిజ్ఞానము నొందును.

నాలుగు ప్రమాణములను గురించియు ఈక్రింద సూక్ష్మముగా తెలుపుచున్నాము.

(1) కారణవాదప్రమాణము:—ఈప్రమాణమున కా ధారము జడవిజ్ఞానశాస్త్రమునందు అవలంబింపబడిన కార్య కారణతత్త్వము. అనగా, 'ప్రతికార్యమునకును కారణముండి తీరవలయును. ఏకార్యమును తనంతటతాను కాజాలదు.' అను సత్యము. జగత్తు ఒక కార్యము గనుక దీనికి కారణముండి తీరవలయును, ఆకారణమే బ్రహ్మము, అని చెప్పుచున్నారు. కాని జడవిజ్ఞానశాస్త్రమునందు 'కారణము' అను పదము రెండు అర్థములయందు వాడబడుచున్నది. మొదటి అర్థము నందు ఒక కార్యముయొక్క కారణము ఇంకొక కార్యమగు చున్నది. ఉదా. ఖ యొక్క కారణము క అనినప్పుడు, క అ ను కార్యము జరిగినయెడల ఖ అను కార్యము నిశ్చయముగా జరుగును. ఇట్టి కారణమునకు 'నియతపూర్వవర్తిఘటన' అ నగా నిశ్చయముగా ముందుజరిగిన పని అని అర్థము. అగ్ని సంస్పర్శము వలన దహనకార్యము తప్పక జరుగును. ఎక్కడ

ఏవస్తువు తగులబడినను, అంతకుముందు అది అగ్నిహోత్రముతోడి సంస్పర్శను తప్పక పొందియుండి తీరవలయును. అగ్ని సంస్పర్శ లేని దహనక్రియయుండదు. కావున, అగ్ని సంస్పర్శ దహనక్రియకు కారణము. ఇట్లే కంటికి వెలుగుతోడి సంస్పర్శము కలుగగనే వర్ణజ్ఞానము కలుగుచున్నది గనుక, వెలుగు వర్ణజ్ఞానమునకు కారణము. స్పర్శేంద్రియమునకు వేడితోడి సంస్పర్శము కలుగగనే ఉష్ణజ్ఞానము కలుగుచున్నది. గనుక, వేడి ఉష్ణజ్ఞానమునకు కారణము. ముక్కునకు పుష్పములలోని పుప్పొడితో సంస్పర్శము కలుగగనే సువాసనజ్ఞానము కలుగును; గనుక, పుప్పొడి సువాస జ్ఞానమునకు కారణము. ఈప్రకారముగా ఒక కార్యమునకు ముందు తప్పక జరుగవలసిన కార్యము, దాని తరువాత జరుగు కార్యమునకు కారణమగుచున్నది. ఈ అర్థమునందు ఒక కార్యముయొక్క కారణము దానికి ముందు నియతముగా జరుగు మరియొక కార్యమేయగుచున్నది. ఆముందు కార్యమునకు దాని ముందుకార్యమును, దానికి దాని ముందు కార్యమును, దానికి దాని ముందు కార్యమును కారణములు, మొదలు చివర లేని కార్యములగొలుసు, కార్యపరంపర ఏర్పడుచున్నది. ప్రతికార్యమును దాని తరువాతి కార్యమునకు కారణమువలె కనబడును. కొంచె మాలోచింపగానే కారణముగా కనపడిన ఆకార్యముకూడ స్వతంత్రముగాక ఇంకొక

కారణము నపేక్షించుచుండును. ఇట్లు ఒకడు జీవితకాలమాత్ర
యు పరీక్షించినను, ఒక్క కార్యమున కయినను స్వతంత్రకా
రణమును కనుగొనజాలడు. విశ్వమునందెక్కడజూచినను కా
ర్యములేని కారణము దొరకదు. అన్నియు కారణములేని
కార్యములు. ఇట్టి భ్రమలో పడుటకు కారణము, ప్రతి
కార్యమునకును వెనుకనుండు కారణరూపియగు శక్తిని కను
గొనలేకపోవుటయే; గనుక, 'కారణము' అను పదమునకు
'నియతముగా ముందు జరుగునది' అని అర్థముచేసిన యెడల
ఏకార్యమునకును స్వతంత్రమయిన కారణమును, నిజమయిన
కారణమును కనుగొనలేక, మన మొక సుడిలో పడి, నిజమయి
న జగత్కారణమును, కనుగొనలేక పోదుము. కావున, ఇట్టి
భ్రమలో పడకుండ ఆస్తికులందరు జాగ్రత పడవలెను.
'హ్యూమ్', 'కామ్టి', 'స్పెన్సర్' మొదలయిన దార్శనిక
శాస్త్రజ్ఞులు సహితము ఇట్టి భ్రమలోనే పడిరి. 'కారణము'
యొక్క రెండవ అర్థము 'శక్తి' ఈ అర్థమునందు అగ్ని, వె
లుగు, వేడి, పుప్పొడి, మొదలగునవి కేవలము కార్యములు
కావు. ఇవి కొన్ని శక్తులు. ఈశక్తులే దహనము, వర్ణజ్ఞాన
ము, ఉష్ణజ్ఞానము, గంధజ్ఞానము మొదలగు కార్యములకు కా
రణములగుచున్నవి, అని దార్శనిక శాస్త్రజ్ఞులు చెప్పుచున్నా
రు. హ్యూమ్ మొదలగువారు కారణముయొక్క మొదటి అ
ర్థమునందే సంతృప్తినొందిరి. కార్యపరంపరకు వెనుక కారణ

వ్యాపితయగు శక్తియొకటి కలదని తెలిసికొనజాలరయిరి. వారి మతమునందు ప్రత్యక్షము మాత్రమే, ఇంద్రియజన్యజ్ఞానము మాత్రమే, జ్ఞానమున కంతకును ఆధారము. శక్తియనునది యొకటి కలదని వారికి దృఢవిశ్వాసము కలదు కాని వారివిశ్వాసము సహేతుకమయినది కాదు. శక్తియనునది ఎన్నడును ఇంద్రియములకు గోచరమగునది కాదు గనుకను ఇంద్రియజన్యజ్ఞాన మాత్రమే జ్ఞానమున కంతకును ఆధారమని వారు నమ్మెదరు గనుకను, శక్తి శక్తియని యూరక చెప్పినందువలన ప్రయోజనమేమి? శక్తి, కర్తృత్వము, లేక ఇచ్ఛ అనునది ఇంద్రియ గోచరము కాకపోయినను అది విశ్వాసయోగ్యమైన యెడల అది నిశ్చయముగా మన మనస్సులకు గోచరమగు సత్యముగనుండవలెను. ఇంద్రియాతీతమగు ఇచ్ఛాశక్తియనునది ఒకటి కలదని మనమనస్సులయందు నిదర్శనములేమయిన కలదా? ఆహా, కలదు. మనలో ప్రతివారును చేయు కార్యముల మూలమునందు శక్తి, కర్తృత్వము, లేక ఇచ్ఛాశక్తియొక్క నిదర్శనము స్పష్టముగా కనబడుచున్నది. ఇచ్ఛాశక్తిచేతనే నిద్రనుండి మేల్కొనినతోడనే కన్నులు తెరచుచున్నాము, లేచుచున్నాము, నడచుచున్నాము, జీవితమునందలి సమస్తకార్యములను చేయుచున్నాము. ఇచ్ఛాశక్తి లేనిచో మనము ఒక్కకార్యము నయినను చేయుట లేదు. ఈప్రకారముగా కర్మేంద్రియములద్వారా మన మే

బాహ్యకర్మలను చేసినను, జ్ఞానేంద్రియములద్వారా ఆలో
చన, ఊహ, అనుమానము, ప్రయత్నము మొదలయిన మా
నసిక కార్యములు మన మనస్సులలో జరిగినప్పుడును వానికి
మూలములేక కారణము మన ఆత్మయొక్క శక్తి, కర్తృత్వ
ము, లేక ఇచ్ఛ, అని మనము తెలిసికొనుచున్నాము. శక్తి,
కర్తృత్వము అనునవి ఇచ్ఛయొక్క మారుపేళ్లే. కర్మేంద్రి
యములతోగాని, జ్ఞానేంద్రియములతోగాని, మనస్సుతోగా
ని, ఏకార్యముచేసినను ప్రతికార్యమును శక్తివలననే అగుచు
న్నది. శక్తివినా ఏకార్యమును కాజాలదు. ఈప్రకారము
గా, మనస్సునందు, ఇచ్ఛాశక్తియొక్క ప్రభావమును, ప్ర
త్యక్షముగా కనుగొనుచున్నాము. మన స్నేహితులు మన
కార్యములను చూచుచున్నారు గాని వాని కారణమయిన మ
న యిచ్ఛాశక్తిని చూడజాలరు. అట్లే మనమును మన స్నే
హితుల కార్యములను చూచుచున్నాము గాని వాని కారణ
మయినవారి ఇచ్ఛాశక్తిని చూడజాలము. ఇచ్ఛాశక్తి మన
ముచేయు సమస్తకార్యములకును ఏకమాత్ర కారణమయిన
ను అభౌతిక పదార్థమగుటచే ఇంద్రియగోచరము కాజాలదు.
అయినను ప్రతిమానవుడును ఇచ్ఛాశక్తి సమస్తకార్యముల
కును కారణమని మనస్సుచే తెలిసికొనుచున్నాడు. ఈప్రకా
రముగా సమస్తకార్యములకును ఇచ్ఛాశక్తియే కారణమని
మనస్సుయొక్క ప్రత్యక్షసాక్ష్యము తీసికొని బాహ్యప్రపంచ

మునందు జరుగు సమస్త కార్యములకును ఒక మహాశక్తియే ఒక మహత్తమమగు ఇచ్ఛాశక్తియే కారణమని గ్రహింప గలుగుచున్నాము. శక్తిని ఆంతర్యమునందు ప్రత్యక్షముగను, బాహ్యమునందు పరోక్షముగను చూచుచున్నాము. ఆశక్తి ప్రభావము వలననే అసంఖ్యాకములగు జ్యోతిర్మండలములు ఆకాశమునందు నియమానుసారముగా తిరుగుచున్నవి. వాయువు వీచుచున్నది, మేఘములు వర్షించుచున్నవి, అగ్ని జ్వలించుచున్నది, రక్తము ప్రవహించుచున్నది, ఉచ్ఛ్వాసనిశ్వాసములు జరుగుచున్నవి, భోజన పదార్థములు జీర్ణమగుచున్నవి. విశ్వమునందెటుచూచినను ఆమహాశక్తియొక్క కార్యములే. ప్రతికార్యము వెనుకను కారణరూపిణియగు మహాశక్తిని ఊహింపనిది, ఏకార్యమును ఊహింపజాలము. ఈప్రకారముగా జడవిజ్ఞాన శాస్త్రమునందు మనము నేర్చుకొన్న కార్యకారణవాదమే ఈశ్వరాస్తిత్వమునకు కారణవాదప్రమాణమయినది. ఇప్పుడింకొక సంగతిని మనము తెలిసికొనవలయును. ఇచ్ఛ సర్వదా జ్ఞానమయము. జ్ఞానవిహీనమైన ఇచ్ఛ యుండుట అసంభవము. జ్ఞానమయమగు శక్తినిగాక మరియొక శక్తిని మన మెరుగము, మనసునందయినను ఊహింపజాలము. శక్తిని గురించి భావించిన యెడల జ్ఞానమయమగు శక్తినే భావింతుము. సూక్ష్మదృష్టివిహీనులగుటచేతను కేవల స్థూలదృష్టితో విచారించుటచేతను మానసిక శక్తులను

విశ్లేషణ చేయలేకపోవుటచేతను, కొందరు, చేతనమును అచే తనమునుగాని ఇట్టిట్టిదని ఎరుగరాని శక్తియను వస్తువొకటి కల దని భావించుచున్నారు. కావున, విచిత్రమగు ఈజగత్కా ర్యము యొక్క కారణముగా మనము ఏనిరంతర కార్యశీలమ గు శక్తియొకటి కలదని విశ్వసించుచున్నామో, ఆశక్తివిషయ మయి రెండు సిద్ధాంతములు మాత్రమే సంభవము. (1) శక్తి యను ఒకవస్తువు లేనేలేదు, శక్తియందలి విశ్వాసమునకు ఆ ధారములేదు, ఆవిశ్వాసము యుక్తియుక్తముకాదు, అనుట. (2) ఆశక్తి జ్ఞానమయమగు శక్తి, ఒక లేక అనేక జ్ఞానమయ పురుషులశక్తి, అనుట. ఈరెండే సాధ్యములు. శక్తి కలదు, కాని, ఆశక్తి అచేతనము, అజ్ఞేయము, అను సిద్ధాంతము, అ యుక్తికము, ఎంతమాత్రము సహేతుకమయినది కాదు. అచే తనశక్తి, అజ్ఞేయశక్తి అనునది తెలిసికొనుటకును సాధ్యము కాదు, భావించుటకును సాధ్యముకాదు.

కారణవాద ప్రమాణమువలన మనము బ్రహ్మవిజ్ఞా నము యొక్క ఒక అమూల్యమగు ఉపకరణమును పొందితిమి. శక్తి అనునది ఒకటి కలదని ఎప్పుడు తెలిసికొనగలిగితిమో అప్పుడే కొంతవరకు శక్తి స్వరూపుడగు పరబ్రహ్మమును ద ర్శింపగలము.

సంగ్రహముగా చెప్పినయెడల కారణవాదప్రమాణ ముయొక్క లక్షణమిది, ప్రతికార్యముయొక్క కారణమును

ఇచ్ఛయే, కార్యము ఎంతసామాన్యమయినను సరే, విశేషముగా జ్ఞానమును సూచించినను సూచింపకపోయిననుసరే, అది కేవలము ఒకజడ పరమాణువుయొక్క కదలిక మాత్రమయిననుసరే, ఇచ్ఛవినా ఆకార్యము జరుగజాలదు; నిస్సందేహముగా ఈజ్ఞానలేశము బ్రహ్మజ్ఞానము యొక్కబీజము. కాని, ఇది బీజముమాత్రమే, వృక్షముకాదు. ఈయుక్తితో ఈశ్వరాస్తిత్వము సిద్ధాంతము చేయబడలేదు. జగత్కార్యముయొక్క మూలశక్తి ఏకమా, అనేకమా, అనుసంగతి స్థిరపరుపబడలేదు. శక్తిఏజడపదార్థముతో సమస్తసృష్టిని చేయుచున్నదో ఆజడపదార్థము సృష్టింపబడినదా, లేక స్వయంభువుగా తనంతట తాను కలిగినదా, అను సంగతి నిశ్చయింపబడలేదు. వ్యక్తిగతమగుజీవాత్మ సృష్టమా, అసృష్టమా అను సంగతి సహితము ఈయుక్తివలన నిర్ణయింపబడలేదు. మనముచేయు ప్రతికార్యమునకును మన మనసునందుదయించెడు ఇచ్ఛయే కారణమని నిరూపించి మనమనస్సువంటివలెనే బాహ్య ప్రపంచమునందు సహితము శక్తియనునది ఒకటి కలదని ఊహించితిమి, అనుమానించితిమి, గాని, నిశ్చయముగా పూర్వపక్షరహితముగా సిద్ధాంతము కాలేదు. బాహ్యప్రపంచమునందు మనము కార్యములను మాత్రము చూచుచున్నాము. అందలికార్యములయొక్క కారణరూపిణియగుశక్తిని ప్రత్యక్షముగా చూడజాలము. ఊరకవిశ్వసించు

చున్నాము. బహిర్జగత్తును ఎంతకాలము బాహ్యప్రపంచమ ని అనుకొందుమో, బాహ్యజగత్తుకూడ అంతర్జగత్తులోనిదే యని ఎంతవరకు తెలిసికొన జాలమో, అంతవరకును బాహ్య జగత్తునందుకూడ శక్తి కలదని విశ్వసింప గలుగుదుమే కాని, జ్ఞానరూపకముగా, అనుభవరూపకముగా, ప్రత్యక్షసిద్ధముగా తెలిసికొనజాలము.

(2) సృష్టికౌశలప్రమాణము:—ఈప్రమాణము కా రణవాదముయొక్క విశేషప్రయోగము మాత్రమే. కాని ఆప్రమాణముయొక్క ప్రథమ ఆకారమునందు బహిర్జగత్తు నకును అంతర్జగత్తునకును ఎంత ప్రభేదము కలదో ఈద్వితీ యాకారమునందు అంత ప్రభేదముండదు. ఇచ్చట అంత ర్బాహ్యములు ఏకమగును. ఈప్రమాణమునకు ఆధారము ఉద్భిద్విజ్ఞానశాస్త్రముయొక్కయు, ప్రాణివిజ్ఞానశాస్త్రముయొ క్కయు తత్వసమూహము. ఉద్భిజ్జములును (చెట్లు చేమలు మొదలగునవి) ప్రాణికోటిలోనివేగాన, ఉద్భిజ్జ్ఞాన, ప్రాణివి జ్ఞానములను రెంటిని కలిపి ప్రాణివిజ్ఞానమనియే చెప్పవచ్చును. జడవిజ్ఞానమునందు శక్తిత్వము చాలినంతయుండదు. జడప దార్థములయందలి శక్తి పరమాణువులను ఆకర్షించుట స మ్మేళనముచేయుటయందు మాత్రమే కానవచ్చును. ఏశక్తి వలన జడపరమాణువులు ఏకముగాచేరి వాయువు, జలము, లోహములు, మొదలగునవి ఏర్పడుచున్నవో ఆశక్తి పరమా

ణువులయొక్క బాహ్యమందున్నది. ప్రాణిజగత్తునందును తమ యభివృద్ధికిగాను అవసరమయిన ఉపకరణములను, పదార్థములను, బాహ్యమునుండి సంగ్రహించుట కలదు. ఉద్భిద్బీజములును, ప్రాణిబీజములును, బాహ్యమునుండి పదార్థములను సంగ్రహించుకొనియే పుష్టినొందుచున్నవి. కాని, వీనియందు సంగ్రహాకారిణీశక్తి, వెలుపలనున్న పదార్థములను గ్రహించుశక్తి బీజములకు బాహ్యమునందులేదు, అంతర్యమునందున్నది. బీజము తనలో గర్భస్థమయియున్నశక్తివలననే తనకుపయోగకరమయిన ఉపకరణములను సంగ్రహము చేసికొనుచు, తన్ను పోషించుకొనును. బీజము ఈఉపయోగమును తెలిసికొనుట వలననే దానియందు మనోనయనముయొక్కభావము జ్ఞాననేత్రముయొక్క లక్షణము స్పష్టముగా కానవచ్చుచున్నది. బీజము తనచుట్టునుండు అసంఖ్యాకములగు వస్తువులనుండి తనకుపయోగకరమయిన వస్తువులను మాత్రమే సంగ్రహించుకొనును, మిగిలిన సమస్తవస్తువులను విసర్జించును. మామిడిటెంక తియ్యనిరసమును సంగ్రహించుకొనును, చింతగింజ పుల్లనిరసమును సంగ్రహించుకొనును, వేపగింజ చేదురసమును సంగ్రహించుకొనును. మిరపగింజ కారపురసమును సంగ్రహించుకొనును.

అదియును గాక, వృక్షదేహముయొక్క వేళ్ళు, మొదలు, కొమ్మలు, రెబ్బలు, ఆకులు, పువ్వులు, పళ్లుమొద లయిన

వానికి గల పరసంబంధమునందును, మరియు ప్రాణిదేహము యొక్క చేతులు, కాళ్ళు, జఠరము, కళ్ళు, చెవులు మొదలైన అంగప్రత్యంగములకు గల పరస్పరసంబంధము నందును ఈయన్నిటిలో ఉద్దేశము, అభిప్రాయము, నిస్సందిగ్ధము కానవచ్చుచున్నది. దేహముయొక్క ప్రతిభాగమును తన్ను పోషించుకొనుచు మిగిలినభాగములను పోషించుచు, సర్వశరీరమునకును సాహాయ్యముచేయును. సముదాయములో ఆశ్చర్యకరమయిన ఏకత్వము, వైచిత్ర్యములో ఏకత్వము, భేదములో అభేదము కానవచ్చుచున్నది. ఈయేకత్వమువలన, దేహము యొక్క వైచిత్ర్యము బీజముయొక్క ఏకత్వములోనే ప్రచ్ఛన్నముగా నిక్షిప్తమయి యుండెనని, రహస్యముగా దాగియుండెనని తెలియవచ్చు చున్నది. కాని, భౌతికఅర్థమునందు, ఏకత్వము నందు విచిత్రతలేనూలేదు, ఉండనూచాలదు. బీజమును విశ్లేషణచేసి ముక్కముక్కలుగా కోసి బజగర్భస్థభాగములను పరీక్షించిన యెడల దానియందు దేహము యొక్కవైచిత్ర్యముకానరాదు. ప్రచ్ఛన్నముగా నిక్షిప్తమయియున్నదనుటకర్థము దేహముయొక్క విచిత్రతఅభిప్రాయరూపముగా, ఉద్దేశరూపముగా, జగదాత్మయొక్క ఆలోచన యందు ఉండెననుటయే. ఆయుద్దేశమే బీజముయొక్క సమస్తకార్యములను నడిపించుచున్నది. ఇంకొకవిశేషము. జడజగత్తులో వర్తమానము నుండి భవిష్యత్తు జన్మించుచున్నది, కారణ

మునుండి కార్యముకలుగుచున్నది. ప్రాణిజగత్తునందు ఒకయ ర్థమున దీనికి విరుద్ధమయిన ఏర్పాటు. ఇచ్చట భవిష్యత్తునుం డి వర్తమానము జనించుచున్నది. అనగా, భవిష్యత్తునందు ఏవిచిత్రదేహము నిర్మాణము గావలసియున్నదో, దానినిబట్టి వర్తమానబీజము యొక్క కార్యములు నియమింపబడుచున్న వి. అంగప్రత్యంగరూపములగు కార్యముల ద్వారా, కారణ రూపబీజము నియమింపబడు చున్నది. భవిష్యత్తునందు ఎట్టి మొదలు, కొమ్మలు, ఆకులు, పువ్వులు, కాయలు, పండ్లు, ని ర్మాణముకావలసియుండునో దానికి తగిన పదార్థములనే బీజ ము సంగ్రహించుకొనవలయును. భవిష్యత్కార్యమును మన సులో పెట్టుకొని బీజముపనిచేయు చున్నదేమో యన్నట్లుం డును. జరుగబోవుకార్యము జగదాత్మ యొక్క ఆలోచనయం దుండని పక్షమున వర్తమానకారణరూపమగు బీజము అట్టి కార్యమును ఎన్నడును చేయజాలదు. ప్రాణిదేహము యొక్క కాళ్ళు, చేతులు, గుండెలు, జఠరము, మొదలగు యంత్రము లును, ముక్కు, కన్ను, చెవి, నోరు మొదలగు ఇంద్రియము లును ఏయేపనులుచేసి దేహమును సంరక్షించుచున్నవో, ఆ యాపనులు చేయవలెనన్న యుద్దేశముతోనే ఆయాయింద్రి యములు సృష్టింపబడి యున్నవి. వీని నిర్మాణమునకు అంధ ములును అభిప్రాయశూన్యములును అగు నియమములు ఎన్న డును కారణముగా నుండ జాలవు. ఆకర్షణము, వికర్షణము,

ఒకటి మరియొక దానిని తనవయిపునకు లాగుకొనుట, ఒకటి మరియొక దానిని తన నుండి దూరముగా తోసివేయుట, ఈ మొదలగు భౌతికనియమములు ఎంతమీారరాసివయి యున్న ను ఈసమస్తనియమములును, ఉద్దేశముతోను ఉపాయము తోను కూడినవియు విచిత్రములును అగు అసంఖ్యాకప్రాణిదే హములను సృష్టింపజాలవు. " ఈసమస్తదేహములును కేవల భౌతికనియమముల వలన నే సృష్టింపబడినవి " అనుటయు లేక "ఈసమస్తదేహములును హఠాత్తుగా వానియంతట అవియే పుట్టినవి " అనుటయు ఈరెండును సమానములే. శృంఖలత, అనగా ఒకగొలుసులోని ఉంగరములవలె ఒకదానితో నొకటి సంబంధము కలిగియుండుట, ఉద్దేశము, ఉపాయము మొదల గు సమస్తలక్షణములును ఆకస్మికోత్పత్తి యొక్క విపరీతలక్షణములు. ఈసమస్తకార్యములును ఆకస్మికజనకములు అనుట యు, ఈసమస్తకార్యములకు కారణములేదనుటయు రెండు ను సమానములే. ఈసమస్తకార్యముల యొక్క కారణము ని ర్దేశింపబూనిన యెడల, విచిత్రాభిప్రాయసమన్వితుడగు జగ త్స్రష్టను అంగీకరించితీరవలయును. ఏప్రాణవిజ్ఞానము దీని నం గీకరింపదో అది ప్రాణవిజ్ఞానమేకాదు, అది భౌతిక విజ్ఞానము యొక్క నామాంతరము మాత్రమే. మానవులయొక్క సమ స్తకార్యములును మీారశక్యముగాని భౌతిక నియమములకు అధీనములయియున్నవి. అయినను మనము ఆసమస్తకార్యము

లును కేవల భౌతిక నియమములచేతనే జరిగినవని చెప్పుట కంగీకరింపము. ఆసమస్త కార్యముల మూలమునందును శృంఖలత, ఉద్దేశము, ఉపాయము, మొదలగు లక్షణములు గలది ఏదోయొకటి కలదు. కేవలము స్వాధీనమగు ఇచ్ఛను అంగీకరించుటచేతనే ఆకార్యములు అర్థయుక్తములగుచున్నవి. కేవలము స్వతంత్రమగు ఇచ్ఛను అంగీకరించిననేగాని యుక్తియుక్తముగా నుండనికార్యములు జగత్కార్యమునందు అసంఖ్యాకములుగా నున్నవి.

కాని, ఇట్టిలక్షణములు కేవలము ప్రాణిజగత్తునందే నిబద్ధమై యుండలేదు. మేము కేవలము ప్రాణి జగత్తునందే ఈ సమస్త లక్షణములుతోఁచుననుటకు కారణము,జడజగత్తునకును ప్రాణిజగత్తునకును గల వ్యావహారిక ప్రభేదమే. మనము మొదటినుండియు జగత్తును చేతనమనియు అచేతనమనియు రెండు భాగములుగా విభజించుటకు అలవాటుపడియున్నాము. కావున, దేనిని మనము చేతన ప్రపంచమందుమో దానియందే ప్రథమమగిన జ్ఞానమును సులభముగా దర్శింపగలుగుట స్వాభావికము. కాని బాగుగా పరిశీలించిన యెడల స్వతంత్రమును, నిరాశ్రయమును, చేతన నిరపేక్షమును అగు అచేతన ప్రపంచమనునది యొకటి నిజముగా లేదనియు సమస్త ప్రపంచమును అచేతనము లేక చేతనమును ఆశ్రయముగా కలదేయనియు, మనము క్రమముగా తెలిసికొందుము, ఆలోచన

యొక్క ఈద్వితీయసోపానమునందే మనవిూసత్యమును సూ
త్మ్రరూపముగా కనుగొనగలము. జడ ప్రపంచమునకును, చే
తనప్రపంచమునకు గల పరస్పర సంబంధమును గురించి వి
చారించిన యెడల, ప్రాణి జగత్తు ఎట్లు ఆలోచనోద్దేశములచే
నియామింపబడుచున్నదో, జడ ప్రపంచముగూడ అట్లే ఆలో
చనోద్దేశముల ద్వారా నడిపింపబడుచున్నదనియు, భౌతికని
యమము లనునవి, జ్ఞానమయుని యొక్క కార్యప్రణాళులు
మాత్రమేగాని వేరుకావనియు మనము తెలిసికొనుచున్నాము.
స్థూలదృష్టితో చూచినయెడల జలము, వాయువు మొదలుగు
నవి కేవలము జడ వస్తువులనియు, జడపరమాణువుల సమష్టి
మాత్రమే యనియు, ప్రాణులకును వీనికిని గొప్పభేదము కల
దనియు తోచును. కాని, ప్రాణులతో వీనికిగల విడదీయరాని
సంబంధమును గురించి ఆలోచించినయెడల, ఈరెంటికిని మన
ము కల్పించు ప్రభేదము ఎంతమాత్రము సహేతుకము కాద
ని మనము తెలిసికొనవచ్చును.

మనుష్యులుచేయు పనులలో ఉపాయమును చూచి ఆ
లోచనను ఉద్దేశమును గ్రహించుటలేదా? గడియారము కా
లమును తెలిసికొనుట కుపాయమనియు, కలము వ్రాయుట
కుపాయమనియు, ఇట్లే మంచము పరుండుటకును, కుర్చీ కూ
రుచుండుటకును, కంచపాత్ర నీరుత్రాగుటకును, కంచము అ
న్నము తినుటకును, బట్ట కట్టుకొనుటకును, చొక్కా తొడు

గుకొనుటకును, ఇల్లు కాపురముండుటకును, ఈప్రకారముగా మానవునిచే నిర్మింపబడు సమస్తవస్తువులును, ఉద్దేశమును ఆలోచనను సూచించుచుండుటలేదా? ఉద్దేశమునకును ఉపాయమునకును ఎంతబాగుగా సరిపోయిన, రెండింటికి గల అంత సామీప్య సంబంధమును చూచి ఉద్దేశమునకు అంత అనుగుణముగా ఉపాయములను రచించిన మానవుని బుద్ధి కుశలతను, ఆలోచన శక్తిని పొగడుచుండుటలేదా? ప్రాణులతో, జలమునకును వాయువునకును గల సంబంధము అట్టిదికాదా? అది ఆకస్మికమా? ఆలోచన పూర్వకము కాదా? ఉద్దేశమును సూచించుచుండుట లేదా? కేవలము భౌతికనియమముల యొక్క ఫలమా? ఏభౌతిక నియమము ఈసంబంధమునకు హేతువును చెప్పి వ్యాఖ్యానము చేయగలదు? శరీరమునకు, రక్తము, గుండెలు, ఊపిరితిత్తులు, జఠరకోశము, మెదడు మొదలయిన శరీరయంత్రములకు, జలమువలన, వాయువువలన, ఎంత ఆశ్చర్యకరమయిన ఉపయోగము కలదు? వాయువు శ్వాసకోశముల కొరకు, దంతములు నమలుట కొరకు, నాలుక రుచిచూచుట కొరకు, చెవి వినుటకొరకు, ముక్కు వాసనచూచుటకొరకు, కన్ను చూచుటకొరకు, కాళ్ళు నడచుట కొరకు, చేతులు పనిచేయుటకొరకు ఉద్దేశింపబడినట్లు కానవచ్చుటలేదా? ఉద్దేశము బుద్ధియొక్క లక్షణము కాదా? ఉద్దేశమునకును ఉపాయమునకును గల సంబంధము ఎంత ఆశ్చ

ర్యకరమయినది? జలవాయువులు, భౌతిక ఆకర్షణము వలన శరీరములోనికి వచ్చునా, లేక సజీవశరీరము తన ప్రయోజనము కొరకయి వీనిని ఆకర్షించుకొనునా? ఈప్రకారముగా, వెలుతురు, వేడిమి, మెరుపు, చంద్రుడు, సూర్యుడు, మొదలగు సమస్త జడ వస్తువులతోను ప్రాణులకు గల సంబంధము ఆలోచించిన యెడల, జగత్తు అంధనియమములచే నడిపింపఁబడు యంత్రము మాత్రము కాదనియు, ఇది అసంఖ్యాకములగు ఆత్మలకు ఆశ్రయమనియు, పరమాత్మయొక్క విశ్వరూపమనియు, చూడఁగలుగుదుము. ఆకాశమునందలి నక్షత్రరాజితో వీనిలో అంతర్భూతమయిన సూర్యునకును, సౌర జగత్సమూహమునకును గల సంబంధమును గురించి ఆలోచించిన యెడల, ఇవి వేని కవి స్వతంత్రములును ప్రధానములును కావనియు, ఇవి మహాంతమగు విశ్వదేహము యొక్క ఒక్కొక్క అంగమువంటివనియు, తెలిసికొనుచున్నాము.

(3) అస్తిత్వవాద ప్రమాణము:—సృష్టికౌశలప్రమాణమునందు, జడచైతన్యములకుగల భేదము భ్రాంతిజనకమనియు, ఏకత్వమే సత్యమనియు, జడమనునది ఎక్కడను లేదనియు, విశ్వమంతయు చైతన్యమయమనియు ఆభాసమాత్రముగా తెలుపఁబడెను. ఈప్రమాణమునందు ఆయేకత్వము మరింతస్పష్టముగా తెలుపఁబడును. ఈప్రమాణమునందు నిరపేక్షమయిన అస్తిత్వము కేవల చైతన్యమునకు మాత్రమేకలద

నియు, జడమునకు పరాపేక్షలేని స్వతంత్ర అస్తిత్వము లేదని యు, అనగా 'ఉన్నది' అనుట చైతన్యమునకు మాత్రమే చెల్లు నని తెలుపఁబడును; గనుక నేదీనికి అస్తిత్వవాద ప్రమాణమని పేరు పెట్టబడినది. ఈప్రమాణముమనోవిజ్ఞానము శాస్త్రములో నిది. కాని, సకలమనోజ్ఞాన వేత్తలును దీనినిగురించి చెప్పరు, తమ సిద్ధాంతములయందు దీనినవలంబింపరు. ఎందుచేతననగా మ నోవిజ్ఞాన వేత్తలందరును మనోవిజ్ఞానముయొక్క నిజమయిన సోపానమునకు ఎక్కినవారు కారు. జడవిజ్ఞాన వేత్తలలో కొం దరు, జడ ప్రపంచములోని కార్యములు శక్తివలననే కలుగు చున్నవని వ్యాఖ్యానము చేయుచున్నను, శక్తియొక్క నిజస్వ రూపమును గుర్తెరుగ జాలకున్నారనియు, ప్రాణివిజ్ఞాన వేత్తల లో కొందరు, ప్రాణులయొక్క వికాసము అభివృద్ధినిగురించి వ్యాఖ్యానము చేయుచు, ఆవికాసమునకు మూలకారణమయి న అభిప్రాయమునుగురించియు ఆలోచననుగురించియు, తెలి సికొన జాలకున్నారనియు ఇదివరకే చెప్పియున్నాము. అదే రీతిని విచారణయొక్క ఈతృతీయ సోపానమునందును కొంద రుకొందరు మనోవిజ్ఞాన శాస్త్రజ్ఞులు, మనోవిజ్ఞానము లేక జీ వాత్మవిజ్ఞానమును, పరమాత్మ విజ్ఞానము లేక దర్శనమునుం డి స్వతంత్రముగా నుంచుటకు ఇచ్ఛగింతురు. అనగా, బ్ర హ్మవిజ్ఞానము వేరు ఇతరవిజ్ఞానములు వేరు అనితలంతురు. నిజ మువిచారించిన యెడల, ఏవిజ్ఞానమును, బ్రహ్మవిజ్ఞానము లేక

దర్శనమునుండి, స్వతంత్రము కాజాలదు, వేరుకాజాలదు. మనోవిజ్ఞానమును తత్త్వవిద్యలేక దర్శనమునుండి వేరుచేయుట వలని తప్పు స్థూలదృష్టికి సహితము స్పష్టముగా తెలియవచ్చుచున్నది, జ్ఞానము, భావము, ఇచ్ఛ, ఇవి మనోవిజ్ఞానశాస్త్రములోని ఆలోచ్యవిషయములు. కాని, భావమును, ఇచ్ఛయు, జ్ఞానసాపేక్షములు, జ్ఞానమునాశ్రయించుకొని యున్నవి. జ్ఞానము లేనిచోట భావముగాని ఇచ్ఛగాని ఉండజాలవు. జ్ఞానముతో వానికి అచ్ఛేద్యసంబంధము. కావున మనోవిజ్ఞానమునకు మూలవిషయము జ్ఞానమేయని చెప్పినయెడల అతిశయోక్తి కాజాలదు. ఈజ్ఞానభూమియందు నిలువబడిన యెడల, ఏవస్తువును ఈభూమికి బాహ్యమునందు లేదనియు, అన్నియును జ్ఞానమునకు అంతర్గతములే యనియు కానవచ్చును. పాఠకుడు ఈవ్యాసమును చదువుచున్నప్పుడు తనయెదుట, కాగితము, కలము, బల్ల, గోడ, మొదలగు ఏవస్తువులను చూచుచున్నాడో, ఆసమస్తవస్తువులు, శరీరమునకు బాహ్యమందున్న వేగాని, జ్ఞానమునకు బాహ్యమందు లేవు. ఏదేది జ్ఞానమునకు గోచరమయి యున్నదో, ఇప్పుడగుచున్నదో, ముందు కాగలదో ఆసమస్తమును జ్ఞానములోనివే. మరియు, ఈఅర్థమునం దువిశ్వములోని సమస్తవస్తువులును మనస్సులోనివి, ఆత్మలోనివి. కావున, మనోవిజ్ఞానమునకు విషయములయి యున్నవి. ఈసత్యమును ఏపాఠకుడు గ్రహింపజాలడో, అతడు మనోవి

జ్ఞానమును ఎంత తిరగ బోర్ల వేసినను, నిజమయిన మనోవిజ్ఞానసోపానమునకు ఎక్కజాలము. శ్రవణీయములు, స్పృశ్యములు, దృశ్యములు, ఆస్వాదనీయములు, ఆఘ్రేయములును, అగుశబ్దస్పర్శరూప రసగంధములును, స్మరణీయములు, చింతనీయములు, విశ్వసనీయములును, అగు సమస్త విషయములును, జ్ఞానములోనివి, మనస్సులోనివి, ఆత్మలోనివి, అని స్పష్టముగా తెలిసికొనవలెను. అన్నిటిలోను 'ఆత్మజ్ఞానము' అనగా 'నేను తెలిసికొనుచున్నాను' అను భావము ప్రవేశించియున్నది, వ్యాప్తమయియున్నది. కావున, మనము ప్రతిజ్ఞానక్రియయందును కేవలము ఆత్మనే తెలిసికొనుచున్నాము, ఆత్మాతిక్తమగు మరియేవస్తువును తెలిసికొనుటలేదు. జ్ఞానమునందు విషయి (తెలిసికొనువాడు), విషయము (తెలిసికొనబడునది), అను ఒకభేదమును చేయుచున్నాము, నిశ్చయమే. కాని, ఈభేదము కేవల భేదముమాత్రమే, విభాగముకాదు. విషయిని విషయమునుండియు, విషయమును విషయినుండియు వేరుచేయజాలము. విషయిలేని విషయముండదు, విషయములేని విషయియుండదు. విషయియును, విషయమును, పరస్పరము ఒకదానినుండి మరియొకటి స్వతంత్రమయిన వస్తువులు కావు. జ్ఞానమునకు అంతర్గతమయిన పదార్థములయొక్క ఒకసంబంధము మాత్రమే. ఆత్మ ఈసంబంధమునకు కర్తలేక ఆశ్రయము. మరియు ఏభేదము కానవచ్చుచున్నదో ఆభేదము

నకు, ఈసంబాధము అతీతము. మనము ప్రతి జ్ఞానక్రియయం
దును ఒక అఖండమును విషయవిషయీ సంబాధయుక్తమును
అభేదమును అగు ఆత్మవస్తువునే తెలిసికొనుచున్నాము. ఈఆ
త్మవ్యష్టియా, సమష్టియా? వ్యక్తిగతమా, సార్వభౌమికమా?
పరిమితమా, అపరిమితమా? ఏకమా, అనేకమా? సాధార
ణమనోవిజ్ఞానము ఈఆత్మవ్యష్టి, వ్యక్తిగతము, పరిమితము, అ
నేకము, అని చెప్పును. సమష్టి, సార్వభౌమిక, అపరిమిత, అ
ద్వితీయ, ఆత్మను గురించి దీనికి తెలియనే తెలియదు, తెలిసి
కొనదు కోరదు; గాని, నిజమయిన మనోవిజ్ఞానము, ' సమష్టి
ఆత్మనుగురించి తెలిసికొననిది వ్యష్టిఆత్మనుగురించి తెలిసికొను
టకు వీలులేదు' అని చెప్పుచున్నది. నిజముగా వ్యష్టి,
సమష్టి, వ్యక్తిగత సార్వభౌమిక, పరిమిత అపరిమిత, ఏక
బహు, అను పరస్పర భిన్నములగు, రెండు విధములయిన
ఆత్మలు లేవు. ఏకమయి అఖండమగు ఆత్మయందే, వ్యష్టి
భావము, సమష్టిభావము, పరిమితభావము, అపరిమితభావ
ము, కార్యభావము, కారణభావము మిళితమయియున్నవి. పా
ఠకుడు తన యెదుటనుండు వస్తువును తెలిసికొనునప్పుడు నిజ
ముగా దేనిని తెలిసికొనుచున్నాడు? సాధారణమనోవిజ్ఞానవే
త్త చెప్పునదేమనగా, అతడు తన వ్యక్తిగత ఆత్మనున్ను, మరి
యు వైశాల్యము, రంగు, స్పర్శము, మొదలగు కొన్ని మాన
సిక అవస్థలను లేక విజ్ఞానములను తెలిసికొనుచున్నాడు,అ ని

చెప్పును కాని, వ్యష్టిగత ఆత్మయొక్క విజ్ఞానమయిన యెడల, అది దేశకాలములయందు అబద్ధమయి యుండవలెను. ఆయన ఆత్మజ్ఞానముకూడ దేశకాలబద్ధమయి యుండవలెను. కాని, పాఠకుడు దేనిని తెలిసికొనుచున్నాడో అది పయిని చెప్పిన రీతిని దేశకాలబద్ధమయియున్నదా? లేదు. ఎందుచేతననగా, పాఠకుడు ఇదివరలో తెలిసికొన్న వస్తువును మరచిపోయెను, మరియుతాను నిద్రాపరవశుడయ్యెను. పాఠకుని ఆత్మ నిజముగా వ్యష్టిగతమే అయిన యెడల, పైని చెప్పిన అవస్థయందు పాఠకునియొక్క విషయజ్ఞానమును, ఆత్మజ్ఞానమును, ఉభయమును పూర్తిగా నష్టమయిపోవలసినదే. ఎందుచేతననగా, ఆయవస్థయందు జ్ఞానవిషయము అజ్ఞేయమయియుండుట (తెలిసికొనబడిన విషయము తెలిసికొనబడకయుండుట) జ్ఞానవిషయి అజ్ఞానియయియుండుట (తెలిసికొనువాడు తెలిసికొనకయుండుట) ఇట్టివాక్యములు అర్థశూన్యములును, స్వవిరోధములును. ఈసమస్త జ్ఞానమును, మన నిద్రావస్థలో, అజ్ఞానావస్థలో, జ్ఞానభూమియొక్క అట్టడుగుపొరలో ఉండునని కొందరు మనోవిజ్ఞాన వేత్తలు చెప్పుచున్నారు. కాని, వారు నిజమయిన మనోవిజ్ఞాన సోపానమునకు ఎక్కిన వారు కారు. ప్రథమ సోపానమగు జడ విజ్ఞానమునకో, ద్వితీయ సోపానమగు ప్రాణవిజ్ఞానమునకో ఎక్కి, తృతీయసోపానమగు మనోవిజ్ఞానమున కెక్కితిమని భ్రమపడుచున్నారు. ప్రథమ

ద్వితీయ సోపానములయొక్క స్థూలతత్వములను తీసికొని మనో విజ్ఞానమును నిర్మాణము చేయుటకు ప్రయత్నించు చున్నారు. మనోవిజ్ఞానసోపానమునందు నిలువబడి జ్ఞానముయొక్క అట్టడుగుభాగమున తెలియబడని దొకటికలదని చెప్పుటకు ఆధారము లేదు. ఏదియు లేదని యైనను చెప్పవలెను, లేని యెడల, అది జ్ఞానమునకు అంతర్భూతమైయున్నదని అనగా తెలియబడియే యున్నదనియైనను చెప్పవలెను. కేవలము జ్ఞానము, జ్ఞానముతో సంబంధించిన వస్తువులు మాత్రమే మనోవిజ్ఞాన విషయములు. మనోవిజ్ఞానమునకు విషయముల యిన సమస్త పదార్థములకును ఏకమాత్ర ఆశ్రయము జ్ఞానమే, ఆత్మజ్ఞానమే, కాని, వ్యక్తిగతజ్ఞానము విలీనమయినయెడల విషయజ్ఞానమూ నశించును ఆత్మజ్ఞానమూనశించును, అని చెప్పుటకు వీలులేదు. ఎందుచేతనంటే, మీరు మేలుకొని ఇట్లు చెప్పుచున్నారు, 'నేను నిద్రించుటకు పూర్వము చూచినవస్తువిదే, నిద్రించుటకు పూర్వము ఈవస్తువును చూచినవాడను నేనే' అని చెప్పుచున్నారు. నిద్రకు పూర్వమందుండెడుఆత్మజ్ఞానమును,విషయజ్ఞానమును,రెండునుకలిసి తిరిగీవచ్చినవి,పునఃప్రకాశితమయినవి. నిద్రాకాలమందుగూడ అవి ఉండనియెడల, పునఃప్రకాశితములెట్లు కాగలవు? కావున ఉండెననియే సిద్ధాంతము. ఎట్లున్నవి? వ్యష్టిభావముగా, ప్రత్యేకదేశకాలముల యందు బద్ధమయి యుండెనా? అట్లయినచో, నిద్రగాని అ

జ్ఞానముగాని సాధ్యమయియుండదు. కావున, దేనినిమనము వ్యష్టిజ్ఞానమందుమోదానికి ఆశ్రయము లేక దానిస్వరూపము సమష్టిజ్ఞానమే, అని స్పష్టముగా తెలియవచ్చుచున్నది. సమష్టిజ్ఞానము చిరజాగరూకతతో మేలుకొనియుండుటచేతనే, వ్యష్టివిషయజ్ఞానమును, ఆత్మజ్ఞానమును, ఉభయమును పునఃప్రకాశితమగుట సాధ్యమయ్యెను. కావున, ఆత్మయొక్క సమష్టి భావమే, సార్వభౌమిక భావమే, దేశకాలాతీత భావమే, మౌలికము. వ్యష్టిభావము, అవాంతరము, గౌణము, లేక అస్వతంత్రము. అనగా, మనముప్రతిజ్ఞానక్రియ యందును, అఖండమును, నిర్నిద్రమును, సర్వజ్ఞమును, సర్వాధారమును అగు విశ్వాత్మనే, మనఆత్మయని అనుకొనుచున్నాము. ఆయాత్మయందు, విషయవిషయీభేదము, దేశభేదము, కాలభేదము,సమస్తభేదములును, విభాగముచేయుటకు వీలులేని, విడదీయుటకు వలనుపడని రూపముగా మిళితమయియున్నవి. కావున, అతడు అనంతుడు, అద్వితీయుడు. ఆయనకు వెలుపలిదియును ఆయనకు అతిరిక్తమయినదియును ఏదియునులేదు. మనముప్రతిజ్ఞానక్రియ యందును, దేనిని తెలిసికొనుచున్నామో, దానిని విషయమనుడు, లేక విషయియనుడు—అది పయికి పరిమితముగా నున్నట్లు తోచును, దానివెలుపట, ఇంకను వస్తువులు కలవనితోచును. బాహ్యమునందు వస్తువులున్న మాట వాస్తవమే, కాని, దేనిబాహ్యమునందు? ఏ అఖండజ్ఞానవస్తువు, జ్ఞాన

క్రియ యందు, వ్యష్టిరూపముగా ప్రకాశించుచున్నదో, దా
నివ్యష్టిభావమునకు బాహ్యమునందు, ఇంకనువస్తువులున్నమా
టవా స్తవమే, కాని, దానిసమష్టిభావమునకు బాహ్యమునందు
ఏదియును లేదు. దానిసమష్టిభావమునకు బాహ్యమునందు దేని
నికల్పించుకొనజాలము, విశ్వసింపజాలము. విశ్వాతీతుడగు పర
బ్రహ్మమునకువిశ్వము అంతర్గతమయినదేగాని బాహ్యముకాజా
లదు. మనము జ్ఞానక్రియం కాలము నందు వస్తువు యొక్క
ఏస్వరూపమును చూతుమో, జ్ఞానమునందు వస్తువు యొక్క
ఏస్వభావము మనకు గోచరమగుచున్నదో కేవలము అట్లేభా
వింపతగినది, విశ్వసింపతగినది. కావున, అనంతమగు దేశము
ఆదేశమునందుండెడు అసంఖ్యాకములగు వస్తువులు, అనంత
మగు కాలము ఆకాలమునందు జరుగుఅసంఖ్యాకములగు ఘ
టనలు, ఈసమ స్తమును, మనకు ప్రత్యక్షముగా గోచరమగు
వస్తువులవలెనే, ఆత్మవస్తువునకు ఆశ్రితములనియే, అంతర్గత
ములనియే, భావింపవలెను. దేనిని మనము మనఆత్మలని అను
కొనుచున్నామో, దానిసమష్టి భావమునకు అంతర్గతములని
యే భావింపవలెను. కావున, దేనిని మనము వ్యష్టిఆత్మలందు
మో, దానిని, నిజముగా, సమష్టిరూపముగా, అనంతమనియే
భావింపుచున్నాము, అనంతమనియే విశ్వసింపు చున్నాము.
మన యొక్క ఆలోచనయు, విశ్వాసమును విశ్లేషణముచేసి

చూచిన యెడల ఇట్టిభావము, ఇట్టి విశ్వాసము గాక మరియొ కరీతిచింతగాని విశ్వాసము గాని సాధ్యము కాజాలదు. ఇట్లే మనోవిజ్ఞానము తన్ను తెలిసికొనబోయి, తత్త్వవిద్య యందు, బ్రహ్మదర్శనము నందు, పరిణమించును. ఈప్రకారముగా మనమిట్లు తెలిసికొనుచున్నాము. దేనిని మనమందరమును మన మనో వ్యక్తిగత ఆత్మలని అనుకొనుచున్నామో అదియే సమష్టిరూపమున జగదాత్మయగు యున్నది, అదయే మూలము నందు సమష్టిరూపమైనను, వ్యష్టిరూపముగా జీవునియొక్క ప్రాణరూపముగా ప్రకాశించుచున్నది. ఒక్కటయ్యును బహురూపములుగా ప్రకాశించుచున్నది.—,, ఏకం రూపంబహుధాయః కరోతి"—(కఠోపనిషత్ 5-12) అది సత్యస్వరూపము, అదొక్కటియే స్వతంత్రము, నిరపేక్షసత్యము. దేశకాలములు, దేశకాలముల యందు అంతర్గతములయిన, పదార్థసమూహము, ఘటనాసమూహము, ఆపేక్షిక సత్యములు, దానిని ఆశ్రయించిన సత్యములు. అది జ్ఞానస్వరూపము అది వ్యష్టిఆత్మ వలెనే జీవాత్మవలెనే, దేశకాలముల యందు బద్ధమయి జ్ఞానవంతముకాదు. అది సమస్తదేశకాలములను ధరించి జ్ఞానస్వరూపియయి ప్రకాశించుచున్నది. అది అనంతము. ఏదేశకాలముల ద్వారా, విషయములకు హద్దులు, విభాగములు సాధ్యములగు చున్నవో, ఆదేశకాలములకు అది ఆశ్రయము, కావున, సమస్తవిభాగములకు అతీతము. మరియు,

అది అనంతమగుట వలననే అద్వితీయము. రెండు అనంతవస్తు
వులుండజాలవు. అనంతమునుండి స్వతంత్రమయినదియు, అ
నంతమునకు అతిరిక్తమయినదియు, వేరొక వస్తు వుండ
జాలదు.

ఈయుక్తియందు జడ చైతన్యములకును, విషయవిష
యులకును, పరిమిత అపరిమితములకును ఉండెడు విభాగము
దూరమయి, అవిభాగత్వము లేక ఏకత్వమే సిద్ధాంతముచేయ
బడెను. కాని, ఈఏకత్వము అద్వైతలేక అభేదనిర్విశేష
బ్రహ్మవాదము కాదు. ఈ అభేదమునకు బాహ్యమునందు ఏ
భేదమును లేదు. కాని, దీనిలోపలనే సమస్తభేదములును కలవు.
బ్రహ్మమునకు బాహ్యమునందు బ్రహ్మాతిరిక్తమగు వస్తువొక్క
టియును లేదు. అన్ని భేదములును లోపలనే. ఈమతము నిర్వి
శేష అద్వైతవాదము కాదు, ఇది సవిశేష బ్రహ్మవాదము.

(4) నీతి ప్రమాణము:—పయిని చెప్పబడిన యుక్తి
వలన ఈశ్వరుని యొక్క స్వరూపలక్షణములు ప్రమాణము
చేయబడెను. వీనిని పాశ్చాత్యదార్శనికులు దార్శనికలక్షణము
లందురు. ఇకను ఈనీతి ప్రమాణము వలన ఆయన యొక్క
తటస్థలక్షణములు ఋజువుచేయబడును. వీనిని పాశ్చాత్యబ్ర
హ్మవిదులు నైతికలక్షణములందురు. ఈప్రమాణము వలన
సవిశేషబ్రహ్మవాదము, అనగా జీవునితో బ్రహ్మమునకు గ
ల భేదాభేదవాదము, మరింత స్పష్టమగుచున్నది. కాని, ఈచి

చూచిన యెడల ఇట్టిభావము, ఇట్టి విశ్వాసము గాక మరియొ కరీతిచింతగాని విశ్వాసము గాని సాధ్యము కాజాలదు. ఇట్లే మనోవిజ్ఞానము తన్ను తెలిసికొనబోయి, తత్వవిద్య యందు, బ్రహ్మదర్శనము నందు, పరిణమించును. ఈప్రకారముగా మనమిట్లు తెలిసికొనుచున్నాము. దేనిని మనమందరమును మన మనో వ్యక్తిగత ఆత్మలని అనుకొనుచున్నామో అదియే సమష్టిరూపమున జగదాత్మయగు యున్నది, అదయే మూలము నందు సమష్టిరూపమగుటను, వ్యష్టిరూపముగా జీవునియొక్క-ప్రాణరూపముగా ప్రకాశించుచున్నది. ఒక్కటయ్యును బహురూపములుగా ప్రకాశించుచున్నది.—,, ఏకం రూపంబహుధాయః కరోతి"—(కఠోపనిషత్ 5-12) అది సత్యస్వరూపము, అదొక్కటియే స్వతంత్రము, నిరపేక్షసత్యము. దేశకాలములు, దేశకాలముల యందు అంతర్గతములయిన, పదార్థసమూహము, ఘటనాసమూహము, ఆపేక్షిక సత్యములు, దానిని ఆశ్రయించిన సత్యములు. అది జ్ఞానస్వరూపము అది వ్యష్టిఆత్మ వలెనే జీవాత్మవలెనే, దేశకాలముల యందు బద్ధమయి జ్ఞానవంతముకాదు. అది సమస్తదేశకాలములను ధరించి జ్ఞానస్వరూపియయి ప్రకాశించుచున్నది. అది అనంతము. ఏదేశకాలముల ద్వారా, విషయములకు హద్దులు, విభాగములు సాధ్యములగు చున్నవో, ఆదేశకాలములకు అది ఆశ్రయము, కావున, సమస్తవిభాగములకు అతీతము. మరియు,

అది అనంతమగుట వలననే అద్వితీయము. రెండు అనంతవస్తువులుండజాలవు. అనంతమునుండి స్వతంత్రమయినదియు, అనంతమునకు అతిరిక్తమయినదియు, వేరొక వస్తువుండజాలదు.

ఈయుక్తియందు జడ చైతన్యములకును, విషయవిషయులకును, పరిమిత అపరిమితములకును ఉండెడు విభాగము దూరమయి, అవిభాగత్వము లేక ఏకత్వమే సిద్ధాంతముచేయబడెను. కాని, ఈఏకత్వము అద్వైతలేక అభేదనిర్విశేష బ్రహ్మవాదము కాదు. ఈ అభేదమునకు బాహ్యమునందు ఏ భేదమును లేదు. కాని, దీనిలోపల నేసమస్తభేదములును కలవు. బ్రహ్మమునకు బాహ్యమునందు బ్రహ్మాతిరిక్తమగు వస్తువొక్కటియును లేదు. అన్నిభేదములును లోపలనే. ఈమతము నిర్విశేష అద్వైతవాదము కాదు, ఇది సవిశేష బ్రహ్మవాదము.

(4) నీతి ప్రమాణము:—పయిని చెప్పబడిన యుక్తి వలన ఈశ్వరుని యొక్క స్వరూపలక్షణములు ప్రమాణము చేయబడెను. వీనిని పాశ్చాత్యదార్శనికులు దార్శనికలక్షణము లందురు. ఇకను ఈనీతి ప్రమాణము వలన ఆయన యొక్క తటస్థలక్షణములు ఋజువుచేయబడును. వీనిని పాశ్చాత్యబ్రహ్మవిదులు నైతికలక్షణములందురు. ఈప్రమాణము వలన సవిశేషబ్రహ్మవాదము, అనగా జీవునితో బ్రహ్మమునకు గల భేదాభేదవాదము, మరింత స్పష్టమగుచున్నది. కాని, ఈచి

న్న వ్యాసమునందు చోటులేమిచే, ఈప్రమాణము అతిసంక్షే పముగా వ్యాఖ్యానము చేయుచున్నాము. నీతి మార్గావలం బులును, ధర్మసాధనాసక్తులును పరిశుద్ధవర్తనులును కానియె డల, ఈప్రమాణము తృప్తికరముగా బోధపడదు. జగత్తు ఒక ధర్మచక్రమని, ఒకధర్మరాజ్యమని భావించువారికి ఈ ప్రమా ణము పూర్వపక్షరహితమయినదని బోధపడును. మనధర్మా ధర్మవివేకము, మనలో ప్రతివాని యెదుటను ఒకపూర్ణమంగ ళస్వరూపుని యొక్క ఆదర్శమును, ఒక సంపూర్ణపుణ్యమయు ని యొక్క, ప్రేమమయుని యొక్క ఆదర్శమును ప్రదర్శించు చున్నది. ఈయాదర్శమునందు సత్యము, న్యాయము, దయ, క్షమ, ఓర్పు, కోమలత్వము, సౌందర్యము, మాధుర్యము మొ దలగుగుణములయొక్క సమావేశము కలదు. మానవుడుధర్మ సాధనయందును నీతివర్తనమునందును అభివృద్ధినొందిన కొల దిని ఈయాదర్శము అంతకంతకు పరిపూర్ణమును, తేజస్వంత మునుఅగుచుండును. ఈయాదర్శసాహాయ్యమువలననేమనము, మనయొక్కయు ఇతరులయొక్కయు ఆలోచనలను, భావము లను, కార్యములనువిమర్శింతుము. ఈయాదర్శమేమనమనస్సు నందు లేని యెడల ఏవిధమయిన నైతికవిమర్శగాని నైతికమత ముగాని సంభవముకాదు. కాని, ఈఆదర్శము కేవలము ఆద ర్శము మాత్రమే కాదు, ఇది కేవలము ఒకభిన్నసత్తామాత్ర మే కాదు, కల్పనమాత్రమే కాదు. మనము ఎప్పుడు ప్రేమ,

పుణ్యము, మొదలయినవాని యొక్క ఆదర్శమును హృదయ మునందు పోషింతుమో, ఇట్టి ఆదర్శముయెదుట, యెప్పుడు మనము అవనతమస్తకులము కాగలుగుదుమో, అప్పుడు మన అంతరాత్మయే పూర్ణప్రేమ మయునియొక్క, పుణ్యమయుని యొక్క మూర్తినిధరించి ప్రకాశించును. ఈఅంతరాత్మయే జగదాత్మయని మన మిదివరకే తెలిసికొంటిమి. కావున, ఈ ప్రేమ, పుణ్యములయొక్క పూర్ణ ఆదర్శమే ఈశ్వరునియొక్క సాక్షాత్ప్రకాశము. ఈఅంతరాత్మద్వారా మనము ఆయన యొక్క నైతికపూర్ణత్వమును ప్రత్యక్షముగా తెలిసికొనుచు న్నాము. ఆత్మయొక్క సాక్షాత్కారదర్శనము కేవలము ఆత్మ యందే సంభవము. మనము మన జ్ఞానమునందే ఎట్లు ఈశ్వ రజ్ఞానముయొక్క సాక్షాత్ప్రకాశమును దర్శించుచున్నామో అట్లే, మన ప్రేమపుణ్యములను వానియందే ఈశ్వరునియొ క్క ప్రేమపవిత్రతలయొక్క సాక్షాత్ప్రకాశము సంభవము. కేవలము కార్యములనుమాత్రమే చూచి ఎట్లు శక్తిజ్ఞానముల యొక్క సాక్షాద్దర్శనమును చేయలేమో అట్లే కేవలకార్య ములను చూచి ధర్మావహుడును, పాపనుదుడును, అగు ఆపా వన చరిత్రునియొక్క సాక్షాద్దర్శనమును చేయజాలము. జగ త్తునందలి సుఖకరములగు కార్యములవలన మాత్రమే ఈశ్వ రుని యొక్క ప్రేమ ఋజువుచేయబడదు. అట్లే దుఃఖకరమగు కార్యములవలన ప్రేమరాహిత్యమును ఋజువుచేయబడదు.

ప్రేమయొక్కయు, ఇతరనీతి గుణములయొక్కయు సాక్షాత్ప్రమాణము బాహ్యమునందు కాదు, ఆంతర్యమునందు, వివేకమునందు, ధర్మజీవనమునందు, వ్యష్టి ఆత్మయందు అనగా జీవాత్మయందు ప్రకాశించుచున్న జ్ఞానము, మరపు, నిద్ర మొదలయినవానియందు విలీనమయిపోయిన మూలసమష్టి జ్ఞానమునందు ఎట్లు అవ్యాహతమయి చెక్కుచెదరక నిలిచియున్నదో అట్లే వ్యష్టి ఆత్మయొక్క ధర్మబుద్ధి, మోహమేఘాచ్ఛన్నమయి మరుగుపడి అందువలన పాపోదయమయియున్నను, సమష్టిగతమయిన పూర్ణపరిశుద్ధత్వము ఏవిధమయిన కళంకమును లేక అవ్యాహతమయి నిలిచియుండును. వ్యష్టిజ్ఞానము నిద్రకు తరువాత పునఃప్రకాశితమయి, సుషుప్తికాలమునందును సమష్టి ఆకారముగా వర్తమానమయి యున్నదని ఎట్లు ఋజువుచేయబడుచున్నదో అట్లే పాపాత్ముని హృదయమునందు పాపచింతానంతరము, పశ్చాత్తాపము, పవిత్రతయందాకాంక్ష మొదలగునవి పునఃప్రకాశితమయి, అతని అంతర్యమునందుండెడి పరమాత్మ, సర్వదా, అతని ఘోరపాపాచరణ సమయమునందు సహితము, నిర్మలమయి, నిష్కళంకమయి, పూర్ణపవిత్రమయి ప్రకాశించుచునేయుండెనని ఋజువుపడును. కావున, ఈసిద్ధాంతము యొక్క మూడవసోపానమునందు బ్రహ్మము 'సత్యం, జ్ఞానమ్, అనన్తమ్, అద్వైతమ్' అని ఎట్లు తెలిసికొంటిమో, అట్లు, ఈనాలవ సోపానమునందు, మన

మాయనను, 'శివమ్, శుద్ధమ్, అపాపవిద్ధమ్, సుందరమ్' అని తెలిసికొనుచున్నాము.

నాలుగు ప్రమాణములును ఈవ్యాసమునందు, అతి సంక్షేపముగా వ్యాఖ్యానముచేయబడినవి. ఈగ్రంథకర్తవలననే వ్రాయబడిన 'బ్రహ్మజిజ్ఞాస' యను గ్రంథమునందు, మూడవ నాల్గవ ప్రమాణములును, ఆ గ్రంథముయొక్క అనుబంధమునందును, బాబూ నగేంద్రనాథ భట్టోపాధ్యాయులుగారి 'ధర్మజిజ్ఞాస' అను గ్రంథమునందును, ఒకటవ రెండవ ప్రమాణములును, విరళముగా వ్యాఖ్యానము చేయబడియున్నవి.

ఓం బ్రహ్మకృపాహి కేవలమ్. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.





# బ్రాహ్మధర్మసిద్ధాంతములు.

## 1. మతసత్యములు తెలియవచ్చు విధము.

మనుష్యునకు ఈశ్వరుని తెలిసికొనవలయునను బుద్ధి పుట్టించువాడు ఈశ్వరుడే. ఆకోరిక మనుష్యునకు స్వయముగా కలిగినది కాదు. ఈశ్వరుని ప్రేరేపణవలననే కలిగినది. ఆకోరిక కలిగినతరువాత ఈశ్వరుడే మనుష్యునకు తన్ను గురించి తెలియజేయుచుండును. దేవునిగురించి మనుష్యుడు స్వయముగా తెలిసికొనజాలడు. దేవుడు అనంతకల్యాణ గుణసంపన్నుడు. దేవునిగురించి పూర్ణముగా తెలిసికొనుటకు ఎవరికిని సాధ్యముకాదు. కాని, తెలిసికొనిన కొలదిని ఇంకను తెలిసికొనవలయునను అభిలాష కలుగుచుండును. అభిలాష వృద్ధియయినకొలదిని ఈశ్వరజ్ఞానము వృద్ధియగుచుండును. కోరికను పుట్టించునదియు ఆయనయే, ఆకోరికను సఫలముచేయునదియు ఆయనయే. ఈవిషయమునందు సాధారణముగా ఆస్తికులందరును ఏకాభిప్రాయము కలిగియున్నారు. కాని, భగవంతుడు తన స్వరూపమును మనుష్యునకు తెలియజేయు

విధమునుగురించి రెండు అభిప్రాయములు కలవు. అందొకటి మానవుని స్వాభావిక శక్తులమూలముననే, కుండితులు పామరులు అను భేదములేక మానవులందరును సామాన్యముగా కలిగియుండు శక్తులమూలముననే, ఆయనను తెలిసికొనవచ్చునని. రెండవది భగవంతుడు ఎవరినో కొంతమందిని ఏరి, వారికి మాత్రమే, అలౌకికమగు ఒక ఆశ్చర్యకరమయిన మార్గమున దర్శనమిచ్చి తన్నుగురించి తెలియజేయుననియు, మిగిలిన సామాన్యజనులందరు ఈయద్భుతదర్శనమును పొందినవారు చెప్పునది, విమర్శచేయక, ఇదేమియని ప్రశ్నించక, తప్పొప్పులెన్నక, పరమప్రమాణముగా నంగీకరింపవలయునని. బ్రాహ్మమతము ఈరెంటిలో మొదటి యభిప్రాయమునే అంగీకరించును. బ్రాహ్మసమాజ స్థాపకుడగు రాజా రామమోహనరాయలు 'ఏకేశ్వర విశ్వాసులకొక బహుమతి' అను గ్రంథమునందు ఇట్లువ్రాయుచున్నాడు, "జనులకు మతప్రవర్తకుల ఆదేశములయందు ఎంత సంపూర్ణవిశ్వాసమున్నను, మనుష్యుడు స్వభావమువలననే ఒక విధమయిన అంతశ్శక్తిని కలిగియున్నాడు. బుద్ధిమంతుడగు ఏమనుష్యుడయినను ఒక మతముయొక్క సిద్ధాంతములను అంగీకరింపకమునుపుగాని అంగీకరించిన తరువాతగాని ప్రపంచములోని భిన్నమతముల యొక్క సిద్ధాంతములను నిష్పక్షపాతబుద్ధితో విమర్శించినయెడల, సత్యమునుండి అసత్యమును వేరుచేయుగలడు. ఈసిద్ధాం

తములు సత్యములు,ఇవి అసత్యములు, అని తెలిసికొనగలడు. ఈసమస్త విశ్వమును, విడదీయరాని పరస్పరసంబంధము గల దిగా జేసినట్టియు, సమస్త విశ్వమునకును ఆశ్రయుడును ఆ ధారుడును యున్నట్టియు ఏకేశ్వరుని సాన్నిధ్యమునకే చేరగ లడు. ప్రతిమానవుడును ఎవరివలనను బోధింపబడకయే, ఎవ రివలనను దారి చూపబడకయే, ఈవిశ్వమునంతను తన అపా రజ్ఞాన శక్తిచేత పరిపాలించుచున్న పరమేశ్వరు డొకడు కల డని, తన స్వభావజన్యమగు శక్తిచేతనే ఊహించగలడు" అ ని వ్రాసియున్నాడు. రామమోహనుని తరువాత వచ్చిన యీమతప్రచారకులు, మహర్షి దేవేంద్రనాథ ఠాకూర్, బ్ర హ్మనంద కేశవచంద్రసేన్, బాబూరాజ నారాయణబోస్, మొదలయినవారు గూడ, మనుష్యుడు తనకు సహజముగా నున్న ఈఅంతశ్శక్తివలననే దేవుని తెలిసికొనునని అనేక విధ ముల నొక్కి చెప్పియున్నారు. వారు సహజజ్ఞానమునకును బుద్ధికిని గల భేదమును కూడ తెలిపియున్నారు. మనస్సునకు రెండు శక్తులుగలవు. తలచినవెంటనే, ప్రయత్నమేమియు లే కనే సంగతులను తెలిసికొను శక్తి ఒకటి, ప్రయత్నముచేసి తెలిసికొను శక్తి ఇంకొకటి. బ్రహ్మవాదులవారు సహజజ్ఞాన మును గురించి ఇట్లు నిర్వచించుచున్నారు, "సహజజ్ఞాన మన గా మానవస్వభావమువలననే, వెంటనే, అప్రయత్నముగా తెలియవచ్చు భావములు, వాని సత్యమును మనము ఆలో చ

నలేకయే తెలిసికొనగలము." అని చెప్పియున్నారు. మహర్షి, ఈశ్వరుని గురించి మనకుగల సహజజ్ఞానమును 'ఆత్మ ప్రత్యయము' అని నిర్వచించియున్నారు. ఆయన, దానిని గూర్చి భవానిపుర బ్రహ్మసమాజములోనిచ్చిన ఒక యుపన్యాసములో ఇట్లు చెప్పియున్నారు, "నేను ఉన్నాను గనుక నన్ను సృష్టించినవాడును, రక్షించువాడును, నడుపువాడును అగు బ్రహ్మము ఉన్నాడు, ఇదియే ఆత్మప్రత్యయము. నన్ను సృజించి, రక్షించి, నడుపుచుండెడివాడే, నాక్షేమము కోరువాడు సఖుడు, ఆశ్రయుడు, ప్రభువు, అయియున్నాడు. ఇదియే స్వతస్సిద్ధమయిన ఆత్మ ప్రత్యయము" అని చెప్పియున్నారు. బాబూరాజ నారాయణబోస్ తన 'ధర్మతత్వదీపిక' లో ఇట్లు చెప్పియున్నారు. "సహజసత్యములయొక్క లక్షణములివి: సర్వజనసామాన్యముగా అందరకును తెలియవచ్చుట, ఇతర ప్రేరణలేక అప్రయత్నముగా వానియంతట అవి తెలియవచ్చుట, వేరుప్రమాణమును కోరక స్వప్రమాణములయియుండుట. సహజసత్యములే, బుద్ధిలేక తర్కశక్తివలన నుపయోగించుకొనబడి, జగత్కారణము యొక్క అనంతత్వపరిపూర్ణత్వములు, ఆత్మయొక్క నిత్యత్వము, ఆధ్యాత్మిక సాధనద్వారా జీవాత్మకుగల పరమాత్మతోడి సంయోగము, ఈ మొదలయిన మతముయొక్క మూలసిద్ధాంతములుగా పరిణామము నొందును." అని కనబరచియున్నారు. సాధారణ బ్రాహ్మస

మాజముయొక్క నేతలు, రాజా రామమోహనరాయలు దేని తో తన సమకాలీనుల మనము నాకర్షించియుండెనో అట్టి ఈ దేశపు సనాతన బ్రహ్మవిద్యకును, ప్రస్తుత పాశ్చాత్య వేదాంత శాస్త్రజ్ఞానమునకును సమన్వయముచేసి ఒక అపూర్వ బ్రాహ్మధర్మతత్త్వమును సిద్ధాంతముచేయుటకు ప్రయత్నించిరి. మానవుల బుద్ధివిశేషమును బట్టి ఈశ్వరుడు కలడనుటకు 4 ప్రమాణములు కలవనియు, అజ్ఞానదశలో మొదటి ప్రమాణమును, జ్ఞానాభివృద్ధి అయినకొలదిని మిగిలిన ప్రమాణములును సుబోధములగుననియు, ఒక్కొక్క ప్రమాణమువలన పరమేశ్వరునియొక్క కొన్నికొన్ని లక్షణములు మాత్రమే తెలియవచ్చుచుండుననియు, 4 ప్రమాణములను అవగాహనము చేసికొనినప్పుడే, సాధకునికి ఒక సర్వాంగ సుందరమగు, బ్రహ్మసాక్షాత్కారము లభించుననియు బ్రాహ్మలు చెప్పుచున్నారు. (1) కారణవాద ప్రమాణము. (2) సృష్టికౌశల ప్రమాణము. (3) అస్తిత్వవాద లేక జ్ఞానవాద ప్రమాణము. (4) నీతిప్రమాణము. వీనిలో మొదటిది ఈశ్వరునియొక్క శక్తి, ఉద్దేశములను గురించియు, రెండవది ఆయన సృష్టివిషయిక జ్ఞానమును గురించియు, మూడవది ఆయన ఏకత్వ అనంతత్వములను గురించియు, నాలవది ఆయనప్రేమ పవిత్రతలను గురించియు సిద్ధాంతముచేయును. ఈప్రకారము గా బ్రాహ్మమతమిట్లు చెప్పుచున్నది. "భగవంతుడు మను

ష్యునకుగల స్వాభావిక జ్ఞానశక్తుల మూలముననే తన్ను ద
ర్శింపజేసి తన్ను తెలిసికొనునట్లు చేయును. ఏ అలౌకిక, అ
స్వాభావిక మార్గమువలనను ఆయన తెలియబడుటలేదు. భి
న్నమతములయొక్క వేదగ్రంథములలో కానవచ్చు సత్యము
లు ఆయామత ప్రవర్తకులకు స్వాభావికజ్ఞానమువలననే లభిం
చినవిగాని ఏప్రకృతి విరుద్ధములగు మార్గములవలనను లభించి
యుండలేదు. కావున, వేదాదిమత గ్రంథములను, ఆయాస
త్యప్రవక్తల ప్రవచనములను, మూఢవిశ్వాసముతోగాక గౌ
రవముతో పాటు విమర్శనతోడ విచక్షణతో నేపఠింపవలయు
ను." అనిబ్రాహ్మమతము చెప్పుచున్నది.మానవులందరు భ్రమ
ప్రమాదములకు లోనయినవారే గనుక ఏమతగ్రంథమునుగాని
ఏమత కర్తనుగాని భ్రాంతిరహితమయిన పరమప్రమాణమని
అంగీకరింపగూడదు. ఈశ్వరదర్శనము ఏదేశములోనో ఏకాల
ములోనో కలిగినదిగాక సర్వత్ర, సర్వకాలములయందు కలు
గునదియే గనుక, అన్ని మతగ్రంథములను అందరు మతకర్త
లను సన్మానింపవలెను. సాధ్యమైనంతవరకు భక్తిభావముతో
పఠింపవలెను. ఆగ్రంథములు, ఆప్రవక్తలు, మన దృష్టిని బా
హ్యమునుండి అంతర్ముఖముగా తిప్పుటకును, ఆలోచనను పు
రికొల్పుటకును, నిద్రాణములయియున్న మన యుచ్ఛభావము
లను మేల్కొల్పుటకును, నూతన ధర్మకార్యాచరణమునకు
గడంగుటకును సహాయముచేయును. కావున, మనము వానిన

న్నిటిని సగౌరవముగా చూడవలెను గాని, ఆగ్రంథములయం దు, ఆప్రవక్తలయందు మనకుగల విశ్వాసవ్యాజమున" భక్తి యనెడు నెపమున, ఈశ్వరుడు మనకు అపారప్రేమతో అను గ్రహించిన ఆత్మస్వాతంత్ర్యమును ఎంతమాత్రమును బలిగా నియ్యగూడదు.

## 2 దేవునిగురించి బ్రహ్మమతాభిప్రాయము.

దేవునిగురించి బ్రాహ్మలకు గల యభిప్రాయము, స మాజోపాసన ప్రారంభించునప్పుడు, వారుచదివెడు ఉపనిష త్సూత్రములలో సంగ్రహముగా నిమిడియున్నది. వారికుటుం బోపాసనలోను ఏకాంతోపాసనలోను ఈభావమే నిండియుండు ను. ఆయుపనిషత్సూత్రము లివి:—సత్యంజ్ఞానమనంతం బ్ర హ్మ(తైత్తిరీయము 2. 1.), ఆనందరూప మమృతం యద్విభాతి (2 ముండకము 2. 7.), శాన్తమ్ శివమద్వైతమ్ (మాండూ క్యము 7.), శుద్ధమపాపమవిద్ధమ్ (ఈశ 8.), వీనిలో మొదటి దాని యర్థము—బ్రహ్మము సత్యస్వరూపుడు, సర్వజ్ఞుడు, ఆ ద్యంతరహితుడు. రెండవదానియర్థము—అతడు స్వయంప్ర కాశుడు ఆనందస్వరూపుడు మధుమయుడు. మూడవదానియ ర్థము—అతడు నిర్వికారుడు, శాంతస్వరూపుడు, మంగళస్వరూ పుడు, ఏకమాత్రుడు, అతడుగాక మరియొకడు లేడు. నాలవ దానియర్థము—అతడు పవిత్రుడు, పాపరహితుడు; పాపము అతనిని తాకజాలదు సమీపింపజాలదు, అని.సంగ్రహముగాచె

ప్పిన బ్రాహ్మల యభిప్రాయమిది—అతడు మనయాత్మలకు ఆత్మ,విశ్వమునకు స్రష్ట, ఆశ్రయుడు. అతడొక్కడే సత్య ము,స్వాశ్రితసత్యము,ఇతరఆశ్రయముఅవసరములేని సత్యము మిగిలిన నన్నియు ఆయనతో సంబంధించిన సత్యములు, ఆయన మీద ఆధారపడియున్న సత్యములు. అతడుసర్వజ్ఞుడు సమస్త ఆకాశములోని సమస్తవస్తువులను, సమస్త కాల ములోని సమస్తఘటనలను తెలిసినవాడు, మనమనసులయం దుండు సమస్తఊహాలను భావములనుఅనుభవములను ఎరిగిన వాడు. ఆతడు శక్తియందును, జ్ఞానమునందును, పవిత్రతయం దును, అనంతుడు అపరిమితుడు. అతడు స్వయముగా ఆనం దమయుడు, సృష్టిలోని సమస్తజీవులకును గల సమస్తఆనంద ములకును ఆధారుడు. అతడు మంగళమయుడు, అందరికిని మం చిచేయువాడు, విశ్వమును మంగళకరమయిన శాసనములచే పాలించుచు, ప్రతిజీవి యొక్కయు, ప్రతివస్తువు యొక్కయు, ప్రత్యేక, ప్రత్యక్షసంరక్షకుడు. అతడు అనంతుడు గనుకనే ఒక్కడు, అతని వలె ఆశ్రయము నపేక్షింపని వాడు ఇంకొక డులేడు. అతడు న్యాయమూర్తి, పరమపవిత్రుడు, అతని యందు అణుమాత్రమును అపవిత్రత ఉండజాలదు—దేవుని గురించిన ఈయభిప్రాయము యొక్క సత్యమును బాగుగాగ్ర హింపగోరువారు, విశేషవిద్యాపరిశ్రమ చేయవలెను. నిశ్చల ధ్యానసాధన చేయవలెను. ఈ తత్వము యొక్క సత్యమును

బాగుగా తెలిసికొనుటకును, అనుభవమునకు తెచ్చుకొనుటకు
ను ఆసక్తిగల ప్రీతివానికిని, బ్రహ్మమతగ్రంథములు సహాయ
ము చేయుచున్నవి.

ఈశ్వరుని గురించిన సత్యములు రెండువిధములుగానుం
డును. ఈశ్వరునికి అపరిహార్యముగా, తప్పనిసరిగా ఉండవలసి
న లక్షణములను గురించి చెప్పునవి భావసత్యములు, ఈశ్వరు
నికి ఇట్టిలక్షణములు కలవు అని మనము నిర్ధారణచేసి తెలిసి
కొన్నప్పుడు, ఆలక్షణములకు విరుద్ధములయిన లక్షణములు
ఈశ్వరుని యందుండజాలవు అని పర్యవసానము తేలును. ఈ
ప్రకారముగా ఉండగూడని లక్షణములను గురించి చెప్పునవి
అభావసత్యములు, పయినచెప్పబడిన సత్యం, జ్ఞానం, అనం
తం, ఆనందం, అమృతం, శాంతం, శివం, అద్వైతం, శుద్ధం.
అపాపవిద్ధం, అను ఈపదిలక్షణములును భావసత్యములు. వీ
నిని బాగుగా అవగాహనముచేసికొని భావింపగలిగిన తరువా
త, వీనినుండి పర్యవసితములగు కొన్ని అభావసత్యములు అప
రిహార్యముగా భావింపవలసి యున్నదని బ్రహ్మమతము బోధిం
చుచున్నది. ఈయభావసత్యములను విశేషముగా నొక్కిచెప్పు
టచేతనే బ్రహ్మమతము ఇప్పుడు ప్రపంచములో నుండు ఇత
రమతము లన్నిటికంటెను ఎక్కువభేదమును ప్రదర్శింపుచు,స
ర్వోత్కృష్టమతముగా పరిగణింపబడుచున్నది. అభావసత్య
జ్ఞానము, భావసత్యజ్ఞానమును, భావసత్యజ్ఞానము అభావస

త్వజ్ఞానమును పరిపుష్టినొందించి, సర్వాంగసుందరమగు ఈశ్వ రసాక్షాత్కారమును లభింపజేయుటకు తోడ్పడును. ఈయ భావసత్యములలో ఒకటి, ‘పరమేశ్వరుడు ఎట్టి శరీరమును క లిగియుండ జాలడు’ అనునది. ఈశ్వరునికి శరీరముండునని పా మరులు కొందరు భావింతురు. అది బ్రాహ్మమతము ఒప్పుకొన దు. ఈశ్వరుడు సర్వశక్తుడును అనంతుడు గనుక, ఆయన, రెం డుచేతులో, నాలుగుచేతులో, పదిచేతులో గల ఒకపరిమితశ రీరములో ఇమిడియుండ జాలడు. అనంతవిశ్వమునందు ఆయ నచేయుచుండు అనంతకార్యములకు అట్టి ఏవిధమయిన శరీర ములును కలిగి యుండ నవసరము లేదు. ఇంకొక అభావసత్య ము, ‘ఆయనంత పురుషుడు ఒకమనుష్యుడుగా గాని ఒకజంతు వుగా గాని లేక మరేవిధమయిన శరీరిగా గాని అవతరింపజా లడు.’ అనునది. అటువంటి అవతారముల నెత్తుననుట ఆయన యనంతత్వమునకును సర్వశక్తిత్వమునకును విరుద్ధలక్షణముగా నున్నది. ఆయన సర్వవ్యాపి గనుకను, ప్రతిమనుష్యుని ఆత్మ యందును ఉన్నవాడే గనుకను, ఇచ్ఛామాత్రముచేతనే సృ ష్టిస్థితిసంహారములు చేయ సమర్థుడుగనుకను అట్టి అవతార ములు అనవసరములును అర్థశూన్యములును అయి యున్నవి. ‘ఈశ్వరుడు మానవునికి అనంతశిక్షను వేసి శాశ్వతనరకముల లో పడద్రోయుననుట అసంభవము’ అనునది ఇంకొక అభావ సత్యము. ఈశ్వరుడు అనంతప్రేమ గలవాడు, సంపూర్ణన్యా

యమూర్తి. మనుష్యుడు ఎంతపాపముచేసినను దానికి మిత ముండును గాని అనంతము కాజాలదు. అనంతప్రేమానిధియ గు పరమేశ్వరుని సాన్నిధ్యమున మనుష్యుడు చేయగలిగిన ప రిమితపాపము భస్మీపటలము కాగలదు. కావున పరమేశ్వరు డు ప్రతిమానవుని చిట్టచివరకు మోక్షమునిచ్చి తనతో సం యోగము నొందించుకొని తీరును. మానవుడు తన అవిధేయత వలన ఏకొంతకాలము వరకో పరమేశ్వరునుండి దూరము గానుండ జాలును గాని, అనంతకాలము ఈశ్వరునికి అవిధే యుడును దూరవర్తియు అయియుండజాలడు. ఈప్రకారము గా (1) ఈశ్వరునికి శరీరము అవసరములేదు, గనుకనే (2) ఆ యన అవతారములెత్తడు (3) శాశ్వతనరకము అసంభవము. ఈమొదలయిన అభావసత్యవిశ్వాసము బ్రహ్మమతమును తక్కి న మతముల నుండి స్పష్టముగా వేరుచేయుచున్నవి.

### 3. ఈశ్వరారాధనము.

ఈశ్వరుడు అనంతశక్తుడు, అనంతజ్ఞానసంపన్నుడు, అ నంతప్రేమానిధి, పూర్ణపవిత్రుడు. మనము ఆయనయందు ని వసించు చున్నాము, తిరుగుచున్నాము, జీవించుచున్నాము. ఆయన మనలో ప్రతివానిని అనంతప్రేమతో ప్రేమించును కావున, మనము సదా ఆయన సాన్నిధ్యమున నున్నామనియు ఆయన మనలను అనంతప్రేమతో ప్రేమించుచున్నాడనియు, ఈభావము మనమనస్సులలో సదా నిలిచియుండునట్లు సాధన

చేయుట, మనకువిధి, శుభప్రదము, కల్యాణకరము. మనకు
ను ఆయనకును గల సంబంధమును మనము తరుచు మరచి
పోవుచుందుము. ఇట్టి స్వభావము మనకు క్షేమకరముకాదు.
అది యొక గొప్పలోపము. మనము జ్ఞానార్జనముచేసి అజ్ఞాన
మును పోగొట్టుకొనుటకు ప్రయత్నించినట్లును, నీతిమార్గము
ననుసరించి నైతికలోపములను సవరించుకొనుటకు ప్రయత్నిం
చినట్లును, సాధనద్వారా, మనకును ఈశ్వరునకును గల సం
బంధమును బలపరుచుకొనుటకు ప్రయత్నింపవలయును. మ
నలోపలను వెలుపలను ఈశ్వరుడు నిండియున్నాడనియు, ఈ
శ్వరునికిని మనకునుగల నైతికసంబంధము తల్లిదండ్రులకును
బిడ్డలకును, గురువునకును, శిష్యులకును ఉండుసంబంధములవం
టిదనియు అనుభవమునకు తెచ్చుకొనుటకు ప్రతిదినము, తప్ప
క, కొన్నిగడియలు సాధనచేయుట వలననే ఈకార్యము సఫ
లము కాగలదు. భగవంతునకును మనకునుగల ఈసంబంధ
మును అనుభవమునకు తెచ్చుకొనుటనే బ్రాహ్మలు 'ఉపాస
న' లేక 'ఆరాధన' అందురు. ఆరాధన, స్పష్టముగా మనకు విధి
యైయున్నది. ఎరిగియుండి మనఃపూర్వకముగా దానిని విడనా
డుట పాపము. ఆరాధన మనకు కర్తవ్యము మాత్రమే గాక
ఆనందకారణమును, నైతికబలదాయకమును కూడ, నయియు
న్నది. మనలను ప్రేమించు ఒకపురుషునిగాని, స్త్రీనిగాని, స
మీపించినప్పుడు మనకు ఆనందముకలుగును. ఈశ్వరుడు మన

లను ఏపురుషునికంటెను స్త్రీకంటెను అధికముగా ప్రేమించు నుగనుక, ఆయనదగ్గర నున్నామను జ్ఞానము, ఉపాసకుని వర్ణింపనలవి గాని శాంతిని, ఆనందమును కలిగించును. భగవంతుడు మనలో నుదయించు పరిశుద్ధాలోచనలను, ఉదారాశయములను అంగీకరించుచు ప్రోత్సాహపరుచు చుండెడు సంపూర్ణన్యాయమూర్తియు పూర్ణపరిశుద్ధుడును గనుక, ఆయన సాన్నిధ్యానుభవము, మన ఉదారాభిప్రాయములకును, పూనికలకును బలమునిచ్చును. కావున ఆరాధన ఒక క్రమమయిన అలవాటు అగునట్లుగా సాధనచేయవలెను. ఇది మన ఇతరకర్తవ్యముల నన్నిటిని బాగుగా నెరవేర్చునట్లు చేయును గనుక, ఇది మన పరమకర్తవ్యము. ఇది మిగిలిన మనయలవాటుల నన్నిటిని బలయుక్తములుగను, పవిత్రవంతములుగను చేయును గనుక దీనిని అన్నిటికంటెను ఎక్కువ శ్రద్ధతో సాధనచేయవలెను. మనము ఉదయముననే దైనిక జీవనములో ప్రవేశింతుము గనుకను, క్రమముగా నలవాటుపడిన యెడల, శారీరిక క్షుధకలిగినట్లే ఆధ్యాత్మిక క్షుధకూడ కలిగి మనఆత్మఆధ్యాత్మికాన్నమును కోరును గనుకను, ఉదయము ఆరాధనకు తగిన మంచిసమయము. సాయంత్రము ఆదినమున చేయవలసిన పని పూర్తికాగానే, మనము ఆదినమున చేసినపనులు చూచుకొనుట అవసరము గనుకను చేయలేని పనుల విషయమయి ముందుకూడ అట్లు జరుగకుండ జాగ్రత్తపడవలసి యుండును గ

నుకను, సాయంత్రము గూడ ఉపాసనకు మంచిసమయము. భోజనము చేయ బోవునప్పుడును, గ్రంథపఠనము, లేక ఉద్యోగకృత్యములు ఆరంభించునప్పుడును, ముగించునప్పుడును ఈశ్వరసాన్నిధ్యమును అనుభవించుటకు తగిన సమయములు. సకల సంతోష సమయములును, విచారసమయములును ఉపాసనకు యుక్తసమయములు. ఈప్రకారముగా ఆరాధనచేయు అలవాటు బాగుగా సాధనచేసినయెడల, దైనికజీవనమంతయు, క్రమముగా ఈశ్వరసాన్నిధ్యానుభవము వలన పవిత్రవంతమగును. అపవిత్రపు ఆలోచనలును, అప్రేమకరములును అపరిశుద్ధములును అగుమాటలును, కార్యములును, అంతకంతకుతగ్గిపోవును.

ఉపాసన పూర్ణమగుటకు ఈశ్వరుని యెడల ఆత్మమూడుస్థితులను పొందవలయును. ఆస్థితులే బ్రహ్మమతపరిభాషలో 'ఆరాధన,' 'ధ్యానము,' 'ప్రార్థన,' అని చెప్పబడును. ఆరాధనయనగా భగవంతునిమనకు ప్రత్యక్షము చేసికొని, భక్తితో స్తవముచేయుట. ఈసాధనలో ఆయనను గురించి మనకు తెలిసినలక్షణములన్నియు, ఆయనకును మనకును గల సంబంధమంతయు అనుభవమునకు తెచ్చుకొనుటకు మనము ప్రయత్నింతుము. ధ్యానమనగా మనమాయన సాన్నిధ్యమున నున్నామను భావము యొక్క అనుభవముతో నిండి, అందులో, నిమగ్నులమగుట. ఇది ఆరాధనయొక్క ఉచ్చదశ, పరిపూర్ణావస్థ. ప్ర

ర్థనయనగా మన అధ్యాత్మిక లోపములను ఆశలను ఈశ్వరుని
కి వెలిబుచ్చి ఆయన సాహాయ్యమును మార్గదర్శకత్వమును వే
డుట. ఊపిరివిడుచుట తోడనే ఊపిరిపీల్చుట ఎట్లు స్వాభావిక
ముగా అప్రయత్నముగా అనివార్యముగా తటస్థించునో అట్లే
నిజమయిన ప్రార్థనలు, హృదయపూర్వక మగు ప్రార్థనలు, చే
సినవెంటనే, ఈశ్వరానుగ్రహము, ఈశ్వరవరము లభించుటఅ
నివార్యము. ప్రార్థనయొక్క ఈవివిధాంగములు జాగ్రతగా సా
ధనచేయవలెను. మిగిలిన వానిని విడిచి ఏదోయొక అంగము
మాత్రము సాధనచేసిన యెడల, ప్రార్థన, పూర్ణఫలమునియ్య
జాలదు.

బ్రహ్మమతము ఏకాంతోపాసన మాత్రమే గాక, కుటుం
బోపాసనయు, సంఘోపాసనయు కూడ ఆవశ్యకములని బో
ధించును. కుటుంబజీవనమును, సంఘజీవనమును, చక్కగా
సాధనచేయుటకు, కుటుంబములోని వారును, సంఘములోని
వారును, అప్పుడప్పుడు కలిసికొని, ఏకగ్రీవముగా, ఏకహృద
యముతో ఈశ్వరారాధనచేయుట, అవసరము. ఏకాంతోపా
సన ఒక ప్రత్యేకవ్యక్తి యొక్క ఆధ్యాత్మికజీవనమునకు ఎట్లు
తోడ్పడునో అట్లేకుటుంబ, సాంఘికోపాసనలు కుటుంబము
యొక్కయు సంఘము యొక్కయు ఆధ్యాత్మికజీవనమునకు తో
డ్పడును. సంఘోపాసన కొరకు కలిసికొననట్టియు అట్టి యు
పాసనలో గల ఆనందమును అనుభవింపనట్టియు స్త్రీలును

పురుషులును, పరస్పరము, ఏఆధ్యాత్మిక సంబంధబాంధవ్యము లను కలిగియుండజాలరు. కావున బ్రాహ్మసమాజము సాంఘికోపాసనకు ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చుచున్నది; దానికి అనుబంధముగా చేర్పబడిన సమాజములలోను, సంఘముల లోను, వారపు ప్రార్థనలు, విశేషప్రార్థనలు జరుగునట్లు అను కూలములను కల్పించుచున్నది ; బ్రాహ్మ కుటుంబములలో అట్టియుపాసనజరుగుటకు ప్రోత్సాహమును కలిగించుచున్నది.

సంఘప్రార్థన సాధారణముగా ఉద్బోధన రూపమగు ఒకకీర్తనతో ఆరంభమగును. తరువాత ఆచార్యుడు కొంత ప్రసంగముచేసి ఉద్బోధనచేయును, అనగా సాంఘికులచిత్త మును అన్యవిషయముల నుండి మరలించి ఈశ్వరునివైపునకు త్రిప్ప బ్రయత్నించును. తరువాత ఈశ్వరమహిమను స్తవము చేయుచు ఇంకొకగీతము పాడబడును. అప్పుడు ఆచార్యుడు ఆరాధనచేయుటకు ప్రారంభించును. సభికులందరు మానసిక ముగా ఆయారాధనను అనువర్తించుచుందురు, ఆచార్యుడు పురికొల్పు భావములనే తమ మనసులలో భావింపుచుందురు. కిందటి అధ్యాయములో చెప్పబడిన ఉపనిషన్మంత్రములను, సాంఘికులు సమస్వరముతో నుచ్చరించుటతో ఆరాధనయా రంభమగును. ఆమంత్రములు ఉచ్చరించిన తరువాత, ఆచా ర్యుడు ఈశ్వరునుద్దేశించి, ఆమంత్రములలోని యీశ్వరలక్షణ ములను అభివర్ణించి స్తోత్రముచేయును. ఈస్తోత్రముకొందరు

స్థూలదృష్టులు అనుకొనునట్లుగా, ఈశ్వరుని ఉబ్బ వేయుటకు గాని, ఆయన కోపమును చల్లార్చుటకుగాని చేయబడునదికాదు. అది మన ఆధ్యాత్మిక కల్యాణమునకు, ఉన్నతికి, ఉత్కృష్టసాధనమయి యున్నది. మనకును పరమేశ్వరునకును గల సంబంధమును అనుభవమునకు తెచ్చుకొనుటకును మనహృదయములను ఆయనకభిముఖముగా నుంచగలుగుటకును, స్తోత్రము మనకు సాహాయ్యము చేయును. అది మనకు మేలునే చేయును గనుక, మనమేలును కోరు పరమేశ్వరునికి ప్రియకరముగూడ నయియున్నది. ఆరాధన అయిన తరువాత ఆచార్యుడు ఆరాధనను ఆపి కొన్నినిమిషములు నిశ్శబ్దముగా నుండును. ఈనిమిషములు ధ్యానముకు వినియోగింపబడును. అనగా సాధకులు ఈశ్వర సాన్నిధ్య భావమునందు నిమగ్నులగుటకు ప్రయత్నింతురు. ధ్యానము అయిన తరువాత, ఆచార్యునిచే నడుపబడి, సంఘము, సమస్వరముతో, సంహితల నుండియు, ఉపనిషత్తులనుండియు గ్రహింపబడిన ఈక్రింది ప్రార్థనను గాని, లేక సాంఘికుల దేశభాషతో దాని అర్థమునుగాని, సారాంశమునుగాని చెప్పుదురు.

అసతో మా సద్గమయ । తమసో మాజ్యోతిర్గమయ,
మృత్యోర్మా మమృతంగమయ । ఆవిరావీర్మఏధి,
రుద్ర, యత్తేదక్షిణంముఖం । తేన మాం పాహినిత్యం.
అర్థము—ఓ పరమేశ్వరా, నన్ను అసత్యమునుండి

సత్యమునకు నడుపుము; అంధకారమునుండి వెలుగునకు నడుపుము. మృత్యువునుండి అమృతత్వమునకు నడుపుము. ఓ స్వయం ప్రకాశుడా, నాకు నీదర్శనమిమ్ము. ఓభయంకర మూర్తీ, నీమంగళకరమయిన ముఖముచే నన్ను నిత్యమును రక్షింపుము. అప్పుడు మరల ఒకకీర్తన పాడబడును. తరువాత ఆచార్యుడు ఒకధర్మోపదేశమును చేసి, ప్రార్థనచేయును. ఆఖరున ఒకకీర్తనపాడి ఉపాసనను ముగింతురు.

ఏకాంతోపాసనలో కీర్తనలుగాని ఉద్బోధనగాని ఉండకపోవచ్చును. కాని అదిపూర్ణముగానున్నప్పుడు, ఆరాధన, ధ్యానము, ప్రార్థన అను యీ మూడుఅంగములును బాగుగా సాధనచేయబడవలెను. ఈమూడింటిలోను ముఖ్యమును కష్టతరమును అగు అంగము ఆరాధన. ఇట్టి ఉపాసన చేయుటకు ఉత్సాహముగల ఆరంభకులకు సహాయకరముగా నుండునను ఆశతో ఒకచిన్న ఆరాధనా ప్రణాళిని ఈక్రింద పొందుపరచుచున్నాము.

పైమంత్రములలో చెప్పబడిన ఈశ్వరలక్షణములు పదియును సాధారణముగా ఏడింటిలో నిముడ్చబడును. సత్యం, జ్ఞానం, అనంతం, ఆనందం, శివం, అద్వైతం, శుద్ధం. సత్యం, సత్యం-ప్రభో, నీవు సత్యస్వరూపుడవు. స్వయంభువువు. స్వయంజ్యోతివి. నిరాశ్రయుడవు, నిరాలంబుడవు. విశ్వము నంతకును ఆధారుడవు. చేతనప్రపంచమునందును అచేతనప్రపంచము

నందును మానవాత్మయందును ప్రకాశించునది నీశక్తియే. నీవు జగదాశ్రయుడవు. మాఆత్మలకు ఆత్మవు నీవు మాబాహ్యమునందును అంతర్యమునందును ప్రకాశించుచున్నావు. విశ్వమంతయు నీసత్తాతో నిండియున్నది.

జ్ఞానం—తండ్రీ, నీవు సర్వజ్ఞుడవు, భూలోక ద్యులోకములయందు అంతటను నీదృష్టి ప్రసరించుచున్నది. మాహృదయములయందు గూఢముగా దాగియున్న రహస్యాలోచనలను, భావములను నీవు గ్రహించుచున్నావు. మాచుట్టునుండు బాహ్యప్రపంచమును, మాలోనుండు, ఆధ్యాత్మికప్రపంచమును నీయనంతజ్ఞానమునే ప్రకాశింపజేయుచున్నవి. భౌతికప్రపంచమునందును, జీవప్రపంచమునందును, మానవజీవితమునందును జరిగెడు సమస్తకార్యములును నీయద్భుత కౌశలముచే నడుపబడుచున్నవి. మాయింద్రియములు, బుద్ధి, అంతరాత్మ వీనియన్నిటియందును ప్రకాశించుచు, జీవితముయొక్క చిక్కుదారులలోనుండి దారినిచూపి, మమ్మునునడిపించునదినీజ్ఞానమే.

అనన్తం—నీవు అనంతుడవు. అనంతాకాశమునందును అనన్తకాలమునందును, అనంత ఆత్మలయందును, నీవు నిండియున్నావు. వానినన్నిటికి అతీతుడవును అయి యున్నావు. నీ శక్తిని నీమహిమను గ్రహింపబోయి మాచిన్నబుద్ధులు పరాభవము నొందుచున్నవి, నీరాజ్యము దూరాతిదూరమ్మువం

దుండెడు నక్షత్రములకంటె దూరముగను, ఆద్యంతములు లే
క కోట్లకొలది సంవత్సరములు, యుగములు, మహాయుగము
లు వ్యాప్తమయియున్న కాలముకంటెను విస్తీర్ణముగను వ్యా
పించియున్నది. నీవు అణువుకంటె చిన్నవాడవుగను, మహత్త
మమగు వస్తువుకంటె మహత్తరుడవుగను ఉన్నావు. నీవు అ
న్నిటిని భరించుచున్నావు. నిన్ను భరింపగలిగినది ఒకటియును
లేదు.

ఆనందం.—నీవు మధుమయుడవు. ఆనందమయుడవు.
అనంతము అపారమును అగు నీశాంతి సముద్రమును, సంక్షో
భసముద్రమును సంచలింపజేయుటకు దేనికిని సాధ్యముకాదు.
నీ ఆనందసింధువులో ఒక బిందువే జీవుల హృదయములయం
దు ప్రవేశించి వారిని ఆనందమునందు ముంచివేయుచున్నది.
నీవీప్రపంచమును ఎంత ఆనందమయముగా చేసియున్నను,
నీసహవాససౌఖ్యము తప్ప మరేదియు మానవహృదయమును
సంతృప్తినొందింపజాలదు. మాహృదయములు నీకొరకు త
పించుచున్నవి. నీతో అవిచ్ఛిన్నయోగమును అనుభవించుట
కు కోరుచున్నవి. నీయందు జీవింపగలిగిన వారు శాశ్వతా
నందమును పొందగలిగిరి.

శివం.—నీవు అనంత మంగళమూర్తివి. అతినికృష్టమ
గు ఆత్మనుగూడ నీవు నిర్లక్ష్యముచేయక, ప్రేమతో పూర్ణ
మంగళత్వమునకు తీసికొనిపోవుచున్నావు. జగత్తునందు క్షేమము

చూచు మంగళమంతయు నీ అనంతమంగళ భావముయొక్క ఛాయామాత్రమే. తల్లి, తండ్రి, భార్య, భర్త, స్నేహితుడు, సాధువు, మానవప్రేమికుడు, వీరి అందరి ప్రేమయు నీప్రేమ నణుమాత్రమే. నీప్రేమ అగాధము. అపారము మాజీవి తమునందలి అనుక్షణమును నీవు మాతోనున్నావు. అన్నము పెట్టుచు, దాహమునిచ్చుచు, బట్టలుకట్టుచు, రోగనివారణచే యుచు, ఓదార్చుచు, బోధించుచు, పవిత్రభావములను ఆలో చనలను కోరికలను మాహృదయములయందు జనింపజేసి మ మ్మును అనుప్రాణితులనుగా జేయుచు, మాహృదయసంగ్రా మములయందు సహాయము చేయుచు దుఃఖనివారణచేయుచు, ఆశలను పురిగొల్పుచు నిరంతరము అనంతోన్నపథమున నడి పించుచున్నావు. నీవు తండ్రివి, తల్లివి, స్నేహితుడవు, సహా యుడవు, హృదయనాథుడవు, చిరస్నేహితుడవు, జీవనవల్ల భుడవు.

అద్వైతం—నీవు ఒక్కడవు. నీకంటె అన్యుడులేడు. ప్రపంచమునందలి అనంతభేదములు నీయందు ఐక్యతనొందు చున్నవి. భేదములన్నియు, నీయందు ఉద్భవించుచున్నవి. నీ యందే పరిణామము నొందుచున్నవి. నీవు అన్నిటికిని ఆధారు డవు, కారణుడవు, ఆశ్రయుడవు, నీవు ఒక్కడవే ఆరాధ్యుడవు. మాబుద్ధులు, హృదయములు, ఇచ్ఛలు అన్నియు నిన్నే వెద కుచున్నవి, నీయందే పూర్ణశాంతిని పొందుచున్నవి. నీవే

మాగమ్యస్థానము, నీవే మాప్రాప్యము, నీవే మా రక్షకుడవు, ప్రభువువు, భర్తవు, నేతవు, గురువువు.

శుద్ధం—నీవు పూర్ణమంగళుడవు. నిన్ను పాపలేశమయినను అంటజాలదు. నీసంకల్పములు అమోఘములు, నీభావములు పూర్ణపరిశుద్ధములు, పూర్ణప్రేమ యుక్తములు, నీయిచ్ఛాన్యాయైక శీలము నిత్యపరిశుద్ధము. నీవు మాఅంతరాత్మల ద్వారా మాతో సంపూర్ణపవిత్రములగు వాక్కులతో మాటలాడుచున్నావు. మాజీవితము యొక్క కంటకమయమార్గములయందు సహితము మమ్ము నిరపాయముగా నడిపించుచున్నావు. నీవు మాప్రాణమవు, మాగురువువు, మా నేతవు,మార్గమవు, గమ్యస్థానమవు, ప్రాప్యమవు. మేము నిన్ను వెదకుచున్నాము, నిన్ను సమీపించుచున్నాము, నీయందు శరణుజొచ్చుచున్నాము. మాయాత్మలను నీకర్పించుచున్నాము, నీకయి వినియోగించుచున్నాము. మేము నీకు సమర్పించు ప్రేమ,భక్తి రూపకమగు నైవేద్యమును గ్రహింతువు గాక ! నీకు మేము మరల మరల నమస్కరించుచున్నాము.

5. నైతికజీవనము.

మహర్షి దేవేంద్రనాథ్ఠాగూర్‌గారు వ్రాసిన 'బ్రహ్మధర్మబీజము'అనగా బ్రహ్మమత సారములో ఈశ్వరోపాసనను గురించి ఆయన యిట్లుచెప్పి యున్నారు, 'తస్మిన్ ప్రీతిఃతస్యప్రియకార్య సాధనంచ తదుపాసనమేవ' అనగా, ఆయనను ప్రే

ముంచుటయు ఆయనకు ప్రీతికరములయిన పనులను చేయుట
యు ఈరెండుకార్యములును ఉపాసనయే అని చెప్పియున్నా
రు. క్రిందటిఅధ్యాయములో వర్ణింపబడిన మానసికమును
భావయుక్తమును అగు ఆరాధన ఈశ్వరభక్తిని పురికొల్పుటకు
ప్రబలసాధనమనియు,గనుకనే ఆవశ్యకర్తవ్యమనియుఇదివరకే
కనబరచి యున్నాము. కాని, ఆరాధన కేవలము మానసికము
నుభావయుక్తమును మాత్రమే కాదు. అది మనజీవితములో
విశేషసంబంధము కార్యరూపమున ఫలింపవలసి యున్నది.
మనమెప్పుడును మంచిపనులను చేయుచుండవలయునని ఆ
యన కోరుచుండును. ఆయన కోరికప్రకారము, లోకోపకా
రములగు పనులనుచేయుటకు మనకు తీవ్రమయిన యిచ్ఛయు,
ప్రబలమయిన ప్రయత్నమును లేని యెడల, మనకు యీశ్వ
రునియందు మిథ్యాగౌరవమును, మిథ్యాభక్తియునే గాని నిజ
మయిన గౌరవమును, నిజమయినభక్తియు ఉండజాలవు.

మనము ఒక మనుష్యుని ప్రేమించినప్పుడు ఆయనకు
ఇష్టమయిన పనులనుచేసి ఆయనను సంతోషపెట్టుటకు ప్ర
యత్నింతుము. కేవలస్తోత్రపాఠములతో ఆయన సంతోషింప
డని మనమెరుగుదుము. అట్లే మన యీశ్వరప్రేమయు ఆయ
న కిష్టమయిన కార్యములనుచేసి, ఆయనను సంతోషపెట్టున
ట్లు మనలను పురిగొల్పును. మనము ఆయన నెట్లు సంతోష
పెట్టగలము? ఆయనకు ప్రియమయిన కార్యములేవి? మను

ష్యుడు స్వాభావికముగా, యీశ్వరుని యొక్క అస్తిత్వమును గురించియు, ఆయన లక్షణములను గురించియు తెలిసికొనుటకు శక్తికలిగి యున్నాడనియు, యీవిషయములో ఏశాస్త్రమును గాని, ఏప్రవక్తను గాని అంధప్రాయముగా విశ్వసింప పనిలేదనియు ఇదివరకే చెప్పియున్నాము, అట్లే యీశ్వరునికి అంగీకారమేదో అనంగీకారమేదో తెలిసికొను శక్తి గూడ మానవునికి స్వాభావికముగనే కలదని బ్రాహ్మలు నమ్ముదురు. మన సహజజ్ఞానమూలమునను బుద్ధి మూలమునను యీశ్వరుడెట్లు ప్రకాశించుచున్నాడో అట్లే మనమనస్సాక్షిమూలమున గూడ యీశ్వరుడు ప్రకాశించుచున్నాడు. మనస్సాక్షియొక్క స్వభావమును గురించి—ఎంతవరకు అది తన ఆజ్ఞలద్వారా ప్రత్యక్షమో, ఎంతవరకు అది పరిశీలనమీద ఆధారపడియుండునో, ఎంతవరకు అది విద్యాభివృద్ధులను, హావ్యాస్థితిగతులను అనుసరించి యుండునో—ఇట్టి అంశములన్నిటిని గురించి బ్రాహ్మలలో అభిప్రాయభేదములుండవచ్చును. కాని, మనకర్తవ్యాకర్తవ్యములను తెలిసికొను స్వతస్సిద్ధమయిన శక్తి మనకొకటి కలదనియు, దానినే, మనము మన స్సాక్షియందుమనియు అందరును అంగీకరించిన సత్యము. ఈశ్వరుని యెడల మనకు కర్తవ్యములగు విధులు కొన్ని కలవనియు, మనము సోపాధిక జీవులమును, హేతుజ్ఞానము కలవారము గనుక మనయడల మనకు కొన్ని విధులు కలవనియు,

మనతోడి మానవుల యెడలను, ఇతరజంతువుల యెడలను మనకుకొన్ని విధ్యుక్తధర్మములు కలవనియు మనస్సాక్షి మన కు బోధించుచున్నది. ఉదాహరణము—ఈశ్వరుని యెడల మనము భక్తిప్రేమలు కలిగి, ఆయన ఆజ్ఞానువర్తులమయి యుండవలెను. మన శరీరారోగ్యము విషయమయి జాగ్రత్తపు చ్చుకొనవలయును. మన మనస్సులును ఆత్మలును అభ్యున్నతి ని పొందుటకయి జ్ఞానసాధన చేయవలెను. మనతోడి మాన వులతో సత్యమును, న్యాయమును అగు ప్రవర్తనము కలిగి దయాదాక్షిణ్యములు కలవారమయి యుండవలయును. పెద్ద లను, ప్రభువులను, గురువులను గౌరవింపవలెను. రక్తస్పర్శ, వివాహము, మతము, మొదలయిన బంధములచే సమకూర్చ బడి మనతో సామీప్యసంబంధము కలవారి యెడల విశేష ప్రేమ, విశేషశ్రద్ధ కలిగియుండవలెను. ఈప్రకారముగా మ నస్సాక్షి మన యెదుట బాహ్యాభ్యంతరములకు సంబంధించిన పవిత్రాదర్శములను ప్రకాశింప జేయుచున్నది. మనకు జ్ఞా నాభివృద్ధి అయిన కొలదిని, మనము మనస్సాక్షియొక్క ఆదే శములకు బద్ధులమయి అధికవిశ్వాసముతో దానిని అనుసరిం చినకొలదిని, ఆయాదర్శము గంభీరతయందును వైశాల్యము నందును పెరుగుచుండును. ఆదర్శములు ఉదారతరములగుచుం డును. మనస్సాక్షి మనకుగల సంబంధముల నన్నిటిని, దేవుని తో, మనకుటుంబములోని వారితో, మనసంఘము వారితో,

మనదేశముతో, మానవజాతితో, మనకుగల సంబంధములన న్నటిని గుర్తెరిగి ఆయాసంబంధములకు తగిన విధ్యుక్తధర్మములను నెరవేర్పవలయునని ఆదేశించుచున్నది. వివిధగుణయుక్తమగు మనస్వభావము యొక్క, శారీరక, మానసిక, భావుక, ఆత్మీయ, సంబంధములయిన వివిధదృక్పథములను గుర్తెరిగి, వీనిలో ప్రతిభాగము యొక్క ఉన్నతిసాధనకు తగిన కార్యప్రణాళికలను తయారు చేయుచున్నది. ఈ ప్రకారముగా, 'తస్యప్రియకార్య సాధనమ్,' 'ఆయనకు ప్రియమయిన కార్యములను చేయుట' యనగా మన మనస్సాక్షి మనయెదుట ప్రకాశింపజేయు ఆదర్శానుసారముగా ప్రవర్తించుటయే. దీనిని బ్రాహ్మలు ఈశ్వరోపాసనలోని ఒకయంగముగా నెంచుచున్నారు. మతమనగా కేవలము 'ఏవో కొన్ని కర్మకలాపములను ఆచరించుటయు లేక కొన్ని భావములను భావించుటయు మాత్రమే' అను భ్రమనుండి వారెప్పుడును దూరముగనే తొలగుచున్నారు. వారెన్నడును మతము నుండి నీతి వర్తనమును వేరుచేయరు. వారికి, అంతఃకరణశుద్ధిని పొందుటయు, ఆంతరంగిక బహిరంగజీవనములలో సత్యమును న్యాయమును దయాపూర్వకమును అగు వర్తనము నలవరచుకొనుటయు, బుద్ధి మనస్సాక్షి తమకు ప్రకాశింపజేసిన ఉన్నతాదర్శానుసారముగా తమ కుటుంబజీవనమును సంఘజీవనమును సంస్కరించుకొని పునర్నిర్మాణము చేసికొనుటయు, ఇవి అన్నియు మత

ము యొక్క ప్రధానాంగములే అయియున్నవి. మతజీవనము యొక్క, ధర్మజీవనము యొక్క, ఈయున్నతా దర్శమును పాలించుటలో, వారికి సంభవించుఅవమానమును, బాధలను, వారు సంతోషపూర్వకముగా ఎదుర్కొనుచున్నారు, సహించుచున్నారు. మతమనగా కొన్నికర్మలను చేయుట లేకమానసికముగ కొన్నిభావములను భావించుటమాత్రమేయనియు, జీవితమునకును మతమునకును సంబంధములేదనియు, మన దేశములోను, కొంచెమెచ్చుతగ్గు అన్నిదేశములలోను జనసామాన్యము అభిప్రాయపడుచున్నారు. మతమునందు ఎంతఅభిమానము కలవాడయినను, అసత్యము, లంచములిచ్చుట, పుచ్చుకొనుట, మొదలయిన వానికలో నున్నట్టియు, సామాన్యముగా గొప్పవారు అనువారు సహితము ఆచరించుటకు వెనుదీయనట్టియు, దురాచారములకు లోనయి యుండవచ్చునని యు, కుటుంబములోను సంఘములోను జరుగుచున్న నీతి విరుద్ధములగు కార్యములను ఆమోదింపవచ్చుననియు, మతాచారములను పేరిట ఎంతకూడని పనులయినను ఆచరింపవచ్చుననియు, తమ చుట్టునుండు దురాచారములను అణచివేయుటకు తామెంత మాత్రమును జోక్యము కలుగజేసుకొనక ఉండవచ్చుననియు జనసామాన్యము అభిప్రాయపడు చున్నారు. బ్రహ్మమతము ఇట్టి విరుద్ధాచరణమును నిషేధించుచు, తీవ్రముగా ఖండించుచు, ధర్మజీవనము యొక్క ఉన్నతాదర్శమును ప్రధ

ర్శింపుచు దాని కనుగుణ్యామగు కఠినసాధనను నియమించుచు
న్నది గనుక నే ప్రజాబాహుళ్యము యొక్క ఆమోదమును సు
లభముగా పొందజాలకున్నది. బ్రహ్మమతావలంబకులు కా
గలుగుటకు విశేషనైతిక బలశౌర్యములు కావలసియున్నవి.
సంఘము ప్రతిఘటించి నిలిచినను, తాను ఏకాకియయి యుం
డి సంఘమువలని సమస్తబాధలను అనుభవింపవలసివచ్చినను,
ఈశ్వరునిపయి భారము వేసి తాను నమ్మిన దానిని ధైర్యము
తో అనుష్ఠింపవలసి యున్నది. బ్రహ్మమతము ఆరంభములో
నే యోధజీవనమునకు పురిగొల్పుచున్నది. ప్రతిసాధకుడును
ధర్మరంగమున ఆమరణాంతము సంగ్రామము సలుపవలసి
యున్నది. జీవితముయొక్క సమస్త విభాగములలోను ఉండు
దురాచారములను ఖండించి, సంస్కరణములను నెలకొల్పవల
సి యున్నది. స్వభావముచేతనే పూర్వాచార తత్పరులయిన
ట్టియు, కార్యశూరులు గాక విశేషభావుకులయినట్టియు జాతి
యందు, ఈమతము శీఘ్రప్రవేశము నొందకపోవుటకు ముఖ్య
కారణము దీని యోధలక్షణమే. బ్రాహ్మసంఘము ఆచరణలో
పెట్టినట్టియు, పూర్వాచార పరాయణులు కూడ వాని విలువ
ను గ్రహించి, ఆమోదించి, క్రమక్రమముగా తమ సంఘము
లో ప్రవేశపెట్టు చున్నట్టియు, కొన్ని సంస్కరణములు
ఈక్రింది అధ్యాయములో కనబరచబడును.

## 5. విగ్రహారాధన—జాతిభేదము.

మూడవ అధ్యాయములో చెప్పబడిన 'ఉపాసన'ను గురించి బాగుగ తెలిసికొనినవారు, విగ్రహారాధన ఈశ్వరుని యొక్క అనంతత్వమునకును, జాతిభేదము ఈశ్వరునియొక్క పితృత్వమునకును ప్రత్యక్షవిరుద్ధములని స్పష్టముగా తెలిసికొనగలరు. పరమేశ్వరుడు అనంతుడు గనుకను దేశకాలాతీతుడు గనుకను మనవలె శ్రద్ధతో పోషింపవలసిన శరీరము లేనివాడు గనుకను అన్నపానరూపమునను, పత్రి, పుష్ప, ఫల, వస్త్ర, రూపమునను మనమిచ్చు నైవేద్యములు ఆయనకు అవసరము లేదని స్పష్టమగుచున్నది. ఆయనకు ఇట్టి వస్తువులు అవసరము లేనప్పుడు వీని నిచ్చుటవలన ఆయనను సంతోష పెట్టజాలము. అజ్ఞానులు, సత్యోపాసనను గురించి తెలియని వారు, ఆయనకు ఇట్టి వస్తువుల నర్పించి, అందువలన పాపము కట్టుకొనకపోవచ్చును. కాని, బుద్ధిమంతులును, సత్యమయిన ఆరాధనను గురించి తెలిసికొనినవారును, అట్టి పార్థివపదార్థములను సమర్పించుటవలని నిష్ప్రయోజనమును గ్రహించిన వారును, అట్టి వేళాకోళపు ఆరాధనను చేసినయెడల వారికి తప్పక పాపముసంభవించును. కావున, బ్రహ్మమతము, తద వలంబకులను విగ్రహారాధనతో ఎట్టి సంబంధమును కలుగజేసికొనగూడదని శాసించుచున్నది. విగ్రహారాధకులలో కొంచెము ఆలోచనగలవారు విగ్రహారాధనకు మరియొక కారణ

ము చెప్పుచున్నారు. ఆరాధన చేయునప్పుడు ఈశ్వరునిమీద మన మనసు నిలుచుటకుగాను మన కన్నులయెదుట ఒక విగ్రహముయొక్క గాని, ఒక చిహ్నముయొక్క గాని సాహాయ్యము అవసరము, అని, వారు చెప్పుచున్నారు. అదియును సయుక్తికముకాదు. పరిమిత వస్తువులు అపరిమితుడయిన పరమేశ్వరునికి ప్రతినిధులుగా నుండజాలవు. వారు చెప్పినట్లు సాహాయ్యమే కావలసియున్న యెడల, ఆయన సర్వవ్యాపకుడు గనుక, ఆకారముతో గాని పరిమాణముతో గాని పనిలేక భూమ్యాకాశములయందుండెడి సమస్తవస్తువులు ఆయన ఆవిర్భావమును ప్రకాశింపజేయుటకు సహాయకారులగుచునేయున్నవి. అట్లు ప్రకృతియందలి వస్తుసముదాయమును విసర్జించి మానవహస్తనిర్మితమగు విగ్రహమునే సాహాయ్యముగా గ్రహించువారు, పరమేశ్వరుడు పరిమిత శరీరులమగు మనవలెనే కన్నులతో చూచుననియు చెవులతో వినుననియు ఇట్లే ఆయనకును సకలేంద్రియములును అవసరమని తాము స్వయముగా అభిప్రాయపడుచున్నారు. లేక అజ్ఞానులయందు అట్టి దుర్భ్రమలను బలపరచుచున్నారు, ప్రోత్సహించుచున్నారు. మనము ఇతరులను తప్పుదారిని బెట్టు ఏపనులను చెయ్యగూడదు. సత్యమయిన ఆరాధనను, సత్యమగు మతమును జనసామాన్యము గ్రహించునట్లు, సాధ్యమయినంతవరకు ప్రయత్నింపవలెను. కావున, మన దైనిక ఉపాసనలలో మాత్రమే

గాక, మన జీవితములోని సమస్తవ్యాపారములలోను మూడవ అధ్యాయములో చెప్పబడిన ఆధ్యాత్మికోపాసనయే చేయవలయుననియు, విగ్రహారాధనాది సమస్త నిషిద్ధకర్మలను మాని వేయవలయుననియు బ్రహ్మమతము బోధింపుచున్నది. జాతకర్మ, నామకరణము, అక్షరాభ్యాసము, ఉపనయనదీక్ష, వివాహము, జన్మదినము, శవదహనము, శ్రాద్ధము, మొదలయిన సమస్తకుటుంబ విషయికమయినట్టియు, సంఘవిషయికమయినట్టియు కర్మలయందు ఈశ్వరుని ఆరాధించుటలో, ఆయన స్తోత్రవందన ప్రార్థనాదులతోనే అర్చింపబడవలెను, విగ్రహారాధనము మొదలయిన మూఢాచారములకు సంబంధింపని పరిశుద్ధాస్తిక కర్మలే జరుపబడవలయును. ఇట్టి సమయములయందు జరుపబడవలసిన కర్మలను గురించి బ్రహ్మసమాజము కర్మగ్రంథములను ప్రచురించియున్నది. ఈకర్మలను సాధారణముగా అనుష్ఠానములందురు. మూఢ దురాచారసంబంధము లేని ఇట్టి ఆస్తికకర్మలను ఆచరించువారు ' అనుష్ఠానిక బ్రాహ్ములు ' లేక ' బ్రాహ్ములు ' అని చెప్పబడుదురు.

విగ్రహారాధన ఈశ్వరుని అనంతత్వమునకు ఎట్లు విరుద్ధమయి, సత్యారాధనకు ప్రతిబంధకముగా నున్నదో అట్లే మన దేశమునందు ప్రస్తుతము వాడుకలోనున్న వంశానుగతమగు జాతిభేదము మానవ సోదరత్వమునకును తన్మూలమున ఈశ్వరపితృత్వమునకును విరుద్ధముగానున్నది. ఈశ్వరుడు స

